

"We are at the cross-roads of history and we are facing great historical problems on which depends, our present and of course our future."

"No price is too great for freedom of our people and our motherland."

"I have no doubt in my mind that we shall succeed."

Jawaharlal Nehru



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

చీనా సేనలు భారత భూభాగంపై దురాక్రమణ చేశాయి. ఈ దురాక్రమణను సైనిక చర్యల ద్వారా నిరోధించటానికి మన ప్రభుత్వం పూనుకున్నది. భారతీయు లందరూ ప్రభుత్వం వెనక నిలబడి సైనిక చర్యలను బలపరిచి సర్వ విధాల తోడ్పడాలని భారత ప్రధాని నెహ్రూ ఆదేశించారు. ఆ ప్రకారమే దేశం లోని అన్ని పక్షాలవారూ, అన్ని వర్గాలవారూ ప్రభుత్వానికి అనేక విధాల తోడ్పడుతున్నారు. కొందరు డబ్బూ, కొందరు నగలూ, మరికొందరు రక్తమూ, ఇంకా కొందరు పొలాలూ ఇచ్చేస్తున్నారు. "చందమామ" పాఠకులందరూ యథాశక్తి "రక్షణ నిధి"కి విరాళాలూ, ఇతర సహాయమూ చేయాలని మా ప్రార్థన.

సంపుటి : 31 డిసెంబర్ 1962 సంచిక : 6



# భారత చరిత్ర



మనం ఇంతవరకూ భారతదేశంలో జరిగిన చరిత్ర గురించీ, అక్కడ వెలిసిన సామ్రాజ్యాలను గురించీ, రాజవంశాలను గురించీ ముస్లిముల దాడుల కాలందాకా తెలుసుకున్నాం. తరవాత జరిగిన చరిత్ర గురించి తెలుసుకునే ముందు భారతదేశం యొక్క దేశాంతర చరిత్ర గురించి తెలుసుకుందాం.

భారతదేశం అనాదిగా దేశాంతరాలతో సంబంధం కలిగి ఉండింది. భారతీయులు భూమి మీదా, సముద్రం మీదా ప్రయాణాలు చేసి దేశాంతరాలకు వలసవెళ్ళారు. ఒకప్పుడు భారతదేశానికి బాబిలోనియా, సిరియా, ఈజిప్టులతో వర్తక సంబంధాలుండేవి. క్రీస్తుశకం మొదటి శతాబ్దం మొదలుకుని ఈ వర్తక వివరాలు చరిత్రలో విపులంగా కనిపిస్తాయి.

వర్తకంతో బాటు భారతీయ సంస్కృతీ నాగరికతలుకూడా ఇతర దేశాలకు వెళ్లాయి. అశోకుడి బౌద్ధ ప్రచారకులు పశ్చిమ ఆసియా, ఉత్తర ఆఫ్రికా, ఆగ్నేయ యూరపు ప్రాంతాలకు వెళ్ళారు. అక్కడ బౌద్ధ ధర్మ ప్రచారం చురుకుగా జరిగింది.

అదేవిధంగా పడమర నుంచి రోమను జ్యోతిశ్శాస్త్రమూ, గ్రీకు కళలూ, నాణెముల తయారీ మొదలైనవి భారతీయులు నేర్చారు. భారతీయ ఔషధ శాస్త్రమూ, దశాంశ గణితమూ అరబ్బులద్వారా ప్రపంచ వ్యాప్తి పొందాయి.

మధ్య ఆసియాలో కుషాను రాజుల ధర్మాన కాస్పియన్ సముద్రం నుంచి చీనా గోడ దాకా బౌద్ధం వ్యాపించింది. 7 వ శతాబ్దంలో హ్యూన్ త్సాంగ్ చీనా నుంచి మధ్య ఆసియాకుండా వచ్చేటప్పుడు దారి పొడుగునా అతను భారతీయ మత సంస్కృతులు గమనించాడు. బౌద్ధం మధ్యఆసియా నుంచి చీనాకు వెళ్ళింది.

## 15. దేశాంతరాలలోని హిందూ రాజ్యాలు

క్రీ. శ. రెండవ శతాబ్దం నుంచీ భారతీయులు దేశాంతరాలను పాలించటం మనకు తెలుస్తుంది. ఆ దేశాలలో-మలయా ద్వీపకల్పమూ, కాంబోడియా, అన్నామ్, సుమత్రా, జావా, బాలి, బోర్నియోలలో—భారతీయ మతాచారాలూ, భాషా, లిపీ, పేర్లూ అమలులో ఉండేవి.

దేశాంతరాలలో భారతీయులు స్థాపించిన సామ్రాజ్యాలు వెయ్యి సంవత్సరాలు మించి దక్కాయి. భారతదేశంలో హైందవ పరిపాలన అడుగంటినాక కూడా ఈ సామ్రాజ్యాలు నిలబడి ఉండటం విశేషం. ఇండోచీనాలో చంపా, కంబుజా అని రెండు ప్రధాన రాజ్యాలుండేవి. చంపను ఏలిన రాజులు: జయ పరమేశ్వరవర్మదేవ ఈశ్వరమూర్తి (1050-1060), రుద్రవర్మ (1061-1069), హరివర్మ (1070-1081), మహారాజాధిరాజ శ్రీ జయ ఇంద్రవర్మ (1161-1180), జయసింహవర్మ (1257-1287). వీరంతా మహావీరులు. కుబ్లయిఖాను కూడా చంపను ఓడించలేక పోయాడు. ఈ హిందూరాజ్యం 16 వ శతాబ్దంలో మంగోలు దాడులకు ఓడిపోయింది.

కంబుజ హిందూరాజ్యమైంది క్రీ. శ. ఒకటి, రెండు శతాబ్దులలో కావచ్చు. అది



ఈనాటి కాంబోడియా దక్షిణ ప్రాంతం. "ఇక్కడ వెయ్యిమందికి పైగా బ్రాహ్మణులున్నారు. వారికి ఇక్కడివారు తమ కుమార్తెలను వివాహం చేశారు. వారు అహోరాత్రాలు (వేద?) పఠనం చేస్తూంటారు," అని ఒక చీనా గ్రంథకర్త రాశాడు. ఇక్కడి రాజులలో ప్రసిద్ధులు జయవర్మ అనే పేరుగల వారిలో మొదటి, రెండవ, ఏడవవారూ, యశోవర్మా, రెండవ సూర్యవర్మా అనేవారు. ఈ రాజ్యం పదిహేనవ శతాబ్దంలో విచ్ఛిన్నమయింది.

చంపా కన్న కంబుజ చాలా విస్తృతీ, శక్తీ ప్రదర్శించింది. ఒకప్పుడు కాంబో

డియా, కొచిన్-చీనా, లావోస్, సయామ్, మలయా, బర్మాలలో కొంత భాగమూ ఈ రాజ్యంలో చేరి ఉండేవి. కంబుజ రాజుల చరిత్రను చెప్పగల సంస్కృత శాసనాలు ఇక్కడ అసంఖ్యాకంగా దొరికాయి. వారి ప్రతిభ చాటగల రెండు అద్భుత దేవాలయాలు అంగ్కోర్‌వాత్, అంగ్కోర్ థామ్ అనేవి.

అంగ్కోర్‌వాత్ ప్రపంచ వింతలలో పేర్కొనదగినది. అది ఆదిలో విష్ణు ఆలయం. దీనిపైన అనేక గోపురాలున్నాయి. నట్టనడుమనున్న ఆలయ గోపురం ఎత్తు 213 అడుగులు. ఆంగ్కోర్ థామ్ అనేది ఏడవ జయవర్మ నిర్మించిన రాజధానీ నగరం. ఇది రెండు మైళ్ళ చదరం. దీని చుట్టూ ఎత్తయిన రాతి గోడా, 330 అడుగుల వెడల్పు గల అగడ్తా ఉన్నాయి. (నవంబరు "ప్రపంచపు వింతలు" చూడండి.)

మలయా ద్వీపకల్పంలోనూ ఇండియన్ అర్కిపిలాగోలోనూ రెండు హైందవ రాజ వంశాలు వృద్ధిక్షయాలు పొందాయి. శైలేంద్ర వంశం 8 వ శతాబ్దంలో స్థాపన అయింది. మలయా "చక్రవర్తి" చంపా, కంబుజ దేశాలపై దాడులు చేసేవాడనీ, ఆయన దిన సరి రాబడి 200 మణుగుల బంగారమనీ, ప్రతి ఉదయమూ ఆయన ఒక కొలనులోకి ఒక బంగారు అచ్చు విసిరి వేసేవాడనీ ఆ కాలపు చరిత్రకారులు రాశారు.

శైలేంద్రులపై మొదటి రాజేంద్ర చోళుడు 11 వ శతాబ్దంలో దాడిచేసి కొంత రాజ్యాన్ని కాజేశాడు. 13 వ శతాబ్దంలో శైలేంద్రరాజు సింహలం పై దాడిచేసి అప జయం పొందాడు. తరవాత శైలేంద్రుల ప్రతిభ అంతరించింది. తరవాత జావా హిందూ రాజ్యానికి కేంద్రమయింది.

అయితే 15 వ శతాబ్దంలో ఇస్లాము మతం ఈ ప్రాంతాలను ఆక్రమించేసింది.





# కుమార సంభవము

పంచమాశ్వాసము :

శరవణమం దుండిన యా
షణ్ముఖు తేజంబు చూచి
భయపడి దేవేంద్రుకడకు
పరుగెత్తిరి యక్షవరులు.

"అమరపతీ! మునిపత్నుల
కగ్నివలన నొకడు పుట్టె;
విశ్వామిత్రుడు రుద్రుని
విల్లాతని చేత బెట్టె.

అతడా వింటిని గైకొని
అందఱ భయపెట్టుచుండె;
క్రౌంచగిరిని కూలగొట్టి
గగ్గో లొనరించుచుండె!"

ఆ మాటలు విని ఇంద్రుడు
ఔరాయని మండిపడుచు
పోరికి సిద్ధము గండని
వీరుల కాజ్ఞాపించెను.

దిక్పాలురతో ఇంద్రుని
దేవసైన్య మరుదెంచెను;
నింగి నుండి నేలకు దిగు
గంగవోలె కనిపించెను!

అంత దూరమునందె ఇంద్రుడు
ఆ కుమారుని చూచి హుమ్మని,
తనదు ఐరావత గజంబును
తఱిమె నాతని చంపి రమ్మని.

గళమందు పెనుగంట
ఘణ ఘణిల్లని మ్రోగ
వచ్చిపడె నడకొండ
వలె గజము వేవేగ.

ఆ కుమారస్వామి దానిని
అంత దూరమునందె కన్గొని
ఎదురుకొని అద్దాని మదమును
సదమదము గావించి ఎక్కెను.

ఉత్పల సత్యనారాయణాచార్య

పంచాననమును కాంచిన
ప్రాణభయం బొందు గజము
ఉక్కడగి షడానను కడ
క్రుక్కిన పేనై యుండదె!

షణ్ముఖుపై దేవేంద్రుడు
సప్త మాతృకలను పంపె,
భీకరముగ వా రాతని
పైకి దూకి చెలరేగిరి.

ఆ కుమారవరుని భీక
రాకారము కనినంతట
మాతలు గజగజ లాడిరి,
మమ్ము కావుమని వేడిరి.

ఇంద్రుడపుడు చేయి వీచి
హెచ్చరించె తన సేనల;
షణ్ముఖుపై ఉప్పెన వలె
సైన్యమెల్ల చెలరేగెను!

అప్పుడా కుమారవరుని
ఆర్మొగముల పెనుమంటలు
బయల్వెడలి దేవతలను
భస్మముచేయ దొడంగెను.

అమరులు భయమందినారు,
ఆయుధముల విడిచినారు,
శరణు శరణని కుమార
స్వామికి ప్రణమిల్లినారు.

ఇంద్రుండపు డోర్వక కను
లెఱ్ఱ చేసి బలిమికొలది
వహ్నిసుతునిపై మండెడు
వజ్రాయుధ మెత్తి వైచె.

వహ్నిసుతుని కుడిప్రక్కన
వజ్రము ఇసుమంత తగిలె;
అందుండి విశాఖు డనెడు
అమితబలుం డుదయించెను.

ఆతని గని దేవేంద్రుడు
అమితభయము చెందినాడు;
హయమునెక్కి బ్రహ్మకడకు
రయమున పరుగెత్తినాడు.



వహ్నిసుతుని వృత్తాంతము
వాపోవుచు విన్నవించు
ఇంద్రునితో బ్రహ్మదేవు
డిట్లనె చిఱునవ్వుతోడ.
"ఇంద్రా! అత డెవ రందువు?
ఈశ్వరుని కుమారుడతడు,
ఆ తారకు నణచివేయ
నవతరించినా డాతడు.
అతని నీ సైన్యమునకు
అధిపుని గావింపు మిపుడె;
ఇప్పుడె చని అతని కడకు
ఈశుని తోడ్తెమ్ము, పొమ్ము."
అని పలికిన, దేవేంద్రుడు
మనమున సంతోషమొంది,
శివునిచెంత కేగినాడు,
సవినయముగ మ్రొక్కినాడు.
శివుని కింద్రుడా విషయము
చెప్పి ముదం బొదవించెను;
వేగమె శివపార్వతులను
వెంటబెట్టుకొని వచ్చెను.
అపుడపుడే బ్రహ్మదులు
అఖిలదేవతా గణములు
శ్రీ కుమార వీరుని అభి
షేకమునకు వచ్చినారు.
శివపార్వతు లగ్ని గంగ
చెంతజేరి నిలుచుండిరి;
నలు రూపులతో కొమరుడు
నలుగురి యొద్దకు వచ్చెను!
ఆ కుమారవరుని కడకు
అరిగి బ్రహ్మ దీవించెను;
అఖిలదేవ సైన్యములకు
ఆధిపత్య మొప్పించెను.
హిమవంతుడు మణిపీఠము
అమరించెను షణ్ముఖునకు,
మధ్య నిలిచి దేవగురువు
మంత్రపఠన మొనరించెను.



ఆ కుమారస్వామి శిరమున
అమరపతి అభిషేక జలములు
పూర్ణ మణికలశమ్ములను గొని
పోసె నపుడు సమంత్రకమ్ముగ.

దేవ దుందుభు లపుడు మొరసెను,
పూవుసోనల జల్లు కురిసెను,
అచ్చరలు గంధర్వు లచ్చట
ఆడదొడగిరి, పాడదొడగిరి.

దేవసేనాపతికి ఇంద్రుడు
దివ్యశస్త్రము చేతికిచ్చెను;
పార్వతియు షణ్ముఖుని కప్పుడు
పట్టు వస్త్రము కట్టబెట్టెను.

వైనతేయుడు కొమరసామికి
వాహనంబుగ నెమిలి నిచ్చెను;
దేవగురుడు మహోజ్జ్వలంబగు
దీప్తదండం బొకటి యిచ్చెను.

తారకాసురు డాదిగా గల
దనుజ వర్గము నెల్ల గెల్వగ
ప్రీతితో షణ్ముఖుని కీశుడు
భూతమయసైన్యం బొసంగెను.

ఆ కుమారస్వామి యప్పుడు
లోకభీకర మూర్తి దాలిచి
బోరుకొన పూరించె శంఖము
భూనభోంతర పూరితంబుగ.

అతని శంఖారావమును విని
అఖిలదేవత లుల్ల సిల్లిరి;
దాని విని పీఠాల నుండియు
తారకాదులు దొర్లి పొర్లిరి!

★ సంపూర్ణము ★






## 18

[ కపిల నగరాన్నుంచి వచ్చిన యిద్దరు వర్తకులకు, స్థూలకాయుడు ; కేశవుణ్ణీ, జయమల్లునూ అమ్మేశాడు. రాత్రివేళ అడవిలో నిద్రిస్తున్న వాళ్ళ మీద ఒక సింహం వచ్చి పడింది. కేశవుడూ, జయమల్లూ దాన్ని కాగడాలతో భయపెట్టి తరిమేశారు. వర్తకులు సంతోషించారు. స్థూలకాయుడు తను నష్టపోయానని అరవసాగాడు. —తరవాత]

ఔనిసవర్తకు లిద్దరూ, స్థూలకాయుణ్ణి సముదాయిస్తూ, "అట్టే గొడవపెట్టకు. కావాలంటే, ఈసారి జరిగే కొనుగోలులో నీకు మరింత లాభం కలిగేలాగా చూస్తాం. నీవు చేసే రణగొణ ధ్వనికి, ఏ సింహాల మందో వచ్చిపడితే, అందరం పరలోకయాత్ర చేయవలసివస్తుంది," అన్నారు.

సింహాల పేరు వింటూనే స్థూలకాయుడు గతుక్కుమని, కాళ్ళు చచ్చుపడిన వాడిలా నిలుచున్నచోటే కూలబడిపోయాడు. ఇక ఆ రాత్రికి ఎవరూ నిద్రపోలేదు. అందరినీ ప్రాణభయం పట్టుకున్నది.

రాత్రి గడిచి సూర్యోదయం అవుతూనే వర్తకులు ప్రయాణసన్నాహాలు ప్రారంభించారు. స్థూలకాయుడికి యిస్తామన్న ఐదు బంగారు కాసులూ యిచ్చి, "ఇక నీ దారి నీది. కాస్త జాగర్తగా వెళ్ళు," అన్నారు.

స్థూలకాయుడు అడవినంతా ఓసారి కలయచూస్తూనే బిక్క చచ్చిపోయాడు. అతడికి రాత్రి మీద పడిన సింహాన్ని గురిం



చిన భయం యింకా వదలలేదు. తను ఒంటరిగా తన గుడారల దగ్గిరకు ప్రయాణమై పోయేప్పుడు, అది ఏ చెట్టుచాటు నుంచో ఎగిరి మీదపడితే తనేంకాను?

ఈలోపల వర్తకులు తమ నౌకర్లను హెచ్చరించి బయలుదేరారు. కేశవుణ్ణీ, జయమల్లునూ తతిమ్మా బానిసల నుంచి వేరుచేసి, వాళ్ళను తమ వెనకగా రావలసిందని ఆజ్ఞాపించారు. అటువంటి ధైర్యవంతు లిద్దరు తమ వీపు కాచి వుండటం క్షేమం అన్న నమ్మకం వాళ్ళకు కలిగింది.

"మీ రిద్దరూ మామూలు బానిసల వంటి వాళ్ళు కాదు; బానిసల్లో రాజకుమారుల్లాంటి వాళ్ళు! కపిలనగరంలో మిమ్మల్ని అందరికన్న సంపన్నులైన గృహస్థులు కొనేలా చూస్తాం," అన్నారు వర్తకులు.

వాళ్ళావిధంగా ఒక వంద గజాలు నడిచారో లేదో, వెనక నుంచి స్థూలకాయుడు పెద్దగా కేకలుపెడుతూ పరిగెత్తి రావటం కనిపించింది. వర్తకు లిద్దరూ ఆశ్చర్యపడుతూ వెనుదిరిగి చూశారు. స్థూలకాయుడు రొప్పుతూ రోస్తూ వాళ్ళను సమీపించి, "నా కిప్పుడే గుర్తు కొచ్చింది. కపిలపురంలో నా సొంత పని ఒకటి చూసుకోవాలి. నేనూ మీతోపాటు వస్తాను," అన్నాడు. వర్తకులు ముఖముఖాలు చూసుకుని చిరునవ్వు నవ్వుకున్నారు. వాళ్ళల్లో ఒకడు స్థూలకాయుడి కేసి తిరిగి, "ఓం, నువ్వు కావాలంటే మా వెంట రావొచ్చు. కాని, అడవిలో నీకు మేం రక్షణ కల్పించినందుకుగాను, పది బంగారుకాసు లిచ్చుకోవలిసి వుంటుంది," అన్నాడు.

స్థూలకాయుడు ఓ క్షణకాలం నిర్విణ్ణుడయిపోయి, అంతలోనే ముఖం మీద లేని నవ్వు తెచ్చిపెట్టుకుని, "మీరేదో తమాషా చేస్తున్నారు. ఈ మహారణ్యంలో నాబోటి బలశాలీ, ధైర్యసాహసాలున్న వాడూ, మీ వెంటవుంటే ఎంత వుపయోగం," అంటూ



ఒరలో నుంచి కత్తిదూసి గిర్రుగిర్రున తిప్ప సాగాడు. వర్తకులకు అతడి మీద చాలా జాలి కలిగింది. వాళ్ళు స్థూలకాయుణ్ణి సమీపించి, భుజం తడుతూ, "నీ ధైర్యం మాకు తెలియందికాదు. కావాలంటే మా వెంట రా, సుంకం ఏమీ యిచ్చుకో నవసరంలేదు. కాని, కపిలపురాన్నుంచి తిరుగుప్రయాణం ఎలా చేస్తావు ? నువ్వు లేని సమయంలో నీ నౌకర్లు గుడారాలెత్తి పారిపోతే ఏం చేయగలవు ?" అని అడిగారు.

"వాళ్ళడొక్కలు చీరేస్తాను. నా పేరంటే వాళ్ళకు సింహస్వప్నం. కపిలపురాన్నించి తిరిగి రావటం అంటారా ? ఓః, ఎంతమంది అక్కణ్ణించి ఈ అరణ్యానికి వస్తూపోతూ వుంటారో నాకు తెలియదా!" అన్నాడు.

ఆ తరవాత అందరూ తిరిగి నడక ప్రారంభించారు. అరణ్యంలో కొంతదూరం వెళ్ళిన తరవాత, బాట ఒకానొక లోయ పక్కకు తిరిగింది. అది చాలా లోతైన లోయ. అందులో ఒక నది ప్రవహిస్తున్నది. లోయ పైభాగాన్నుంచి దాదాపు నది దిగువ వరకూ పెద్దపెద్ద వృక్షాలూ, వాటిమీద అడవి తీగలూ పెనవేసుకుని—ఆ ప్రదేశమంతా చూడటానికి మహాభయంకరంగా కనిపిస్తున్నది.




కేశవుడు, పక్కనేవున్న జయమల్లు కేసి తిరిగి చిన్నగొంతుతో, "మల్లూ, మనం ఈ దుర్మార్గుల నుంచి తప్పించుకుపోవాలంటే, ఈ ఎత్తునుంచి నదిలో దూకితే సరిపోతుంది. ఏమంటావ్ ?" అన్నాడు.

జయమల్లు అగాధం దిగువకేసి ఓసారి చూసి, "మనం చెట్లకొమ్మలకు తగులుకోకుండా సూటిగా నదిలోకి దూకగలిగితే ప్రమాదం వుండదు. అలాకాక......"

జయమల్లు మాట పూర్తిచేసే లోపలే, బానిసల గుంపుకు ముందుండి దారితీస్తున్న వర్తకుల నౌకర్లు, కెవ్వుమని కేకలుపెట్టారు. ఎదురుగావున్న రాళ్ళచాటు నుంచీ, చెట్ల



బోదెల మాటు నుంచీ పెద్దపెద్ద కత్తులు పట్టుకున్న నరమాంసభక్షకులు కొందరు, "చండమండూకుడికీ జై!" అంటూ పిశాచాల్లా అట్టహాసం చేస్తూ ముందు కురికారు.

"బాణాలు ... కత్తులు ... ఈటెలు ..." అంటూ కీచుమని బానిసవర్తకు లిద్దరూ వెనక్కు రెండడుగులు వేసి, "జ్యేష్ఠా, కనిష్ఠా! మీరే మమల్ని, ఈ నరభక్షకుల్నుంచి కాపాడాలి. మీకు స్వేచ్ఛ యిచ్చేస్తున్నాం," అంటూ అరిచారు.

కేశవుడూ, జయమల్లూ త్రుటికాలంలో ఒక నిర్ణయానికి వచ్చారు. నరభక్షకుల వాతపడితే, ఇక స్వేచ్ఛ అనేదే లేదు. ఇలా ఆలోచించి, చప్పున యిద్దరూ బానిసవర్తకుల్ని గట్టిగా వడిసి పట్టుకుని, అగాధం అంచునుంచి దిగువనున్న నదికేసి దూకుతూ, "గురిగా నదిలోకి పడగలిగితే, మీకు స్వేచ్ఛ; ఏ చెట్టుకొమ్మకో తగులుకున్నారో, చావు," అంటూ కేక పెట్టారు.

ఈలోపల నరభక్షకులు, తమను ఎదిరించిన బానిసవర్తకుల నౌకర్లను యిద్దరు ముగ్గుర్ని కత్తులతో నరికి, పడ్డచోటునుంచి బంతిలా పైకెగిరి వెనక్కు తిరిగి పారిపోతున్న స్థూలకాయుణ్ణి వెంబడిస్తూ, "ఆ మాంసం పోగును ప్రాణాలతో పట్టుకోండి, మన నాయకుడికి బహూకరిద్దాం. చల్లపడిన మాంసం ఆయన ముట్టడు," అంటూ కేకలు పెట్టసాగారు.

కేశవుడూ, జయమల్లూ అగాధం దిగువనున్న మహావృక్షాల కొమ్మలకు తాకకుండా అదృష్టవశాత్తూ, సూటిగా నదిలోకి పడిపోయారు. అలా పడేటప్పుడు నీటి తాకిడికి బానిసవర్తకు లిద్దరూ వాళ్ళ పట్టునుంచి జారిపోయారు.

బానిసవర్తకు లిద్దరూ నీటిలో మునుగుతూ తేలుతూ, "రక్షించండి, జ్యేష్ఠా, కనిష్ఠా, రక్షించండి! మీకు స్వేచ్ఛ యిస్తాం," అంటూ అరవసాగారు.

చావు బతుకుల మధ్య కూడా బానిస వర్తకులు తమను యింకా వాళ్ళ ఆస్తిగా భావించి కేకలుపెట్టటం కేశవుడికి ఎక్కడ లేని కోపాన్ని తెప్పించింది. అతడు జయమల్లును హెచ్చరిస్తూ, "వీళ్ళకు నీటి గండం రాసిపెట్టి వున్నది! ఈ నరరూప రాక్షసులను తుదముట్టిద్దాం," అంటూ వాళ్ళ కేసి ఈదబోయాడు. కాని, అంతలో అగాధం పైనుంచి భీకరమైన కేకలూ, ఆ వెంటనే రివ్వుమంటూ కొన్ని ఈటెలూ— నదిలోకి వచ్చిపడినై.




"నరమాంసభక్షకులు, మనను చూశారు. ఇక జాగరణ లాభంలేదు. నీటిపాలు వెంట ఈదుకుపోవటమే క్షేమం," అంటూ జయమల్లు పెద్దపెద్ద బారలతో నది దిగువకు ఈదుతూ, కేశవుణ్ణి హెచ్చరించాడు.

నది మహావేగంగా ప్రవహిస్తున్నది. కేశవుడూ, జయమల్లులు పెద్దగా ఈదకుండానే, ఆ వేగానికి కొట్టుకుపోసాగారు.

హఠాత్తుగా వాళ్ళకు నది మధ్య లంక లాంటి ఒక ప్రదేశం కంటబడింది. నదీ ప్రవాహం అక్కడ రెండు పాయలుగా చీలి, ఆ లంకను చుట్టి ప్రవహిస్తున్నది. అప్పటికి బాగా అలసిపోయిన కేశవుడూ, జయమల్లూ పరస్పరం హెచ్చరించుకుని, ఆ లంక కేసి ఈదసాగారు. కొద్దిసేపటికల్లా వాళ్ళు తీరాన్ని చేరి, తాము బలవంతంగా నదిలోకి గుంజిన బానిస వర్తకుల కోసం నదికేసి చూశారు. వాళ్ళ జాడలేదు.

కేశవుడూ, జయమల్లూ లంకలోకి బయలుదేరారు. వాళ్ళు నాలుగైదడుగుల దూరం వెళ్ళారో లేదో, వాళ్ళకు అక్కడ ఇసుకలో పాదాలగుర్తులు కనిపించినై.

"ఈ లంక నిర్మానుష్యమైంది కాదు. ఇక్కడ ఎవరో వున్నారు. ఎవరై వుంటారు?" అన్నాడు కేశవుడు.

"వాళ్ళెవరైతేనేం, మనం నిరాయుధులం," అన్నాడు జయమల్లు.



"అంత దిగులు పడకు జయమల్లూ. మనం యిప్పటికే ఎన్నోసార్లు మృత్యుముఖాన్నుంచి బయటపడ్డాం. ఇంకా ప్రమాదాలంటే భయపడవలసిన అవసరం ఏముంది?" అంటూ కేశవుడు లంక లోపలికి దారితీశాడు.

వాళ్ళిద్దరూ కొంతదూరం నడిచి ఒక ఎత్తయిన దిబ్బలాంటి ప్రదేశాన్ని చేరి, అక్కడినుంచి దిగువకు చూశారు. ఆ దిగువ, సమతలంగా వున్న ఒక ప్రదేశంలో పాతికా ముప్పై చుట్టు గుడిసెల్లాంటివి వున్నవి. వాటి ముందు కత్తిచేబట్టిన ఒకడు కాపలా కాస్తున్నాడు.

"వాడి ఆకారం చూస్తే నరభక్షకుడిలా వున్నాడు, అవునా?" అని అడిగాడు కేశవుడు. జయమల్లు అవునన్నట్టు తల వూపుతూ, "అదుగో, వాడు మన కేసే తల తిప్పాడు, మనను చూసినట్టున్నది," అంటూ చప్పున చెట్లచాటుకు పోయాడు. కేశవుడు కూడా జయమల్లును అనుసరించ బోయేంతలో, కాపలావాడు, "హేయ్‌ౘ, ఎవరక్కడ, ఆగు!" అంటూ పరిగెత్తి రాసాగాడు.

"కేశవా, వాడు నిన్నొక్కణ్ణే చూసినట్టున్నది. దగ్గిరకు రాగానే వాడితో మాటలు పెట్టుకో," అంటూ జయమల్లు మోకాళ్ళ మీద పాకుతూ పక్కకు వెళ్ళిపోయాడు.

కేశవుడు అనుమానించినట్టు, ఆ కాపలావాడు నిజంగా నరభక్షకుడే. వాడు లొట్టలు వేస్తూ కేశవుడి దగ్గిరకు వచ్చి, "ఒంటరివాడివా, లేక తోడుగా ఎవరైనా వున్నారా? అసలు ఈ లంకకు ఎలా రాగలిగావు?" అంటూ, కేశవుణ్ణి నఖశిఖ పర్యంతం పరీక్షగా చూసి, "లేతా ముదురూగాని, మాంచి దోరమాంసం! నేను ఆకలి మీద వుండటం చూసి, నిన్నే లంకదేవతే యిక్కడికి పంపి వుంటుంది!" అంటూ కత్తి పైకెత్తాడు.

ఆ సరికి నరభక్షకుడి వెనక్కు పాకుతూ వచ్చిన జయమల్లు, చిరుతగండులా ఒక్క

ఎగురున నరభక్షకుడి మీదికి దూకి, తలతో వాడి వెన్నుమీద గట్టిగా ఒక్క తాకు తాకాడు. నరభక్షకుడు ఒక్క చావుకేక పెట్టి, ముందుకు విరుచుకుపడ్డాడు. వాడి చేతిలోని కత్తి జారి దూరంగా పడింది. కేశవుడు ఒక్క ఊపులో దాన్ని చేతికి తీసుకుని, నరభక్షకుడి కంఠాన్ని తెగవేశాడు.

"ఇద్దరికీ కలిసి ఒక్క ఆయుధం, చాలు!" అంటూ జయమల్లు, మిట్టకు దిగువగా వున్న చుట్టుగుడిసెల కేసి చూశాడు. అక్కడ ఎవరూ వున్నట్టులేదు.

"ఇదేదో తమాషాగా వున్నది. అడవిలో మనను ఎదుర్కొన్న నరభక్షకుల నివాసస్థానం యిదే అయివుంటుంది. వాళ్ళంతా వేటకు వెళితే, వీడు కాపలాకాస్తున్నాడన్న మాట. గుడిసెల్లో ఏముందో ఒకసారి చూద్దామా? తరవాత మన దారిన మనం వెళ్ళవచ్చు," అన్నాడు జయమల్లు. కేశవుడు సరే నన్నాడు. వెంటనే ఇద్దరూ మిట్ట దిగి పిల్లుల్లా నిశ్శబ్దంగా గుడిసెలచుట్టూ వున్న కంచె దాటి లోపల ప్రవేశించారు. వాళ్ళకు గుడిసెలకు మధ్యగా కొంచెం ఎత్తుగావున్న ఒకచోట, తతిమ్మా వాటికన్న కొంచెం పెద్దదైన ఒక గుడిసె కనిపించింది.

"అది బహుశా, నరభక్షకుల నాయకుడి భవనం అయివుంటుంది!" అంటూ జయమల్లు చిన్నగా నవ్వాడు. వాళ్ళిద్దరూ దాన్ని సమీపించారు. హఠాత్తుగా లోపలి నుంచి మాటలు వినిపించినై.

"చెప్పు, నువ్వెవరో నాకు తెలిసిపోయింది! ఆ జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ ఎవరో కూడా నాకు, తెలుసు! వాళ్ళెక్కడ?" అని కసురుతున్నట్టు ప్రశ్నించుతున్న ఒక కంఠం. కేశవుడూ, జయమల్లూ నిశ్చేష్టులయారు. ఆ కంఠధ్వని ఎవరిది? బ్రహ్మదండి మాంత్రికుడిదా? లేక నరభక్షకుల నాయకుడైన చండమండూకుడిదా?

—(ఇంకా వుంది)






# వ్యర్థ ప్రయాస

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీ వ్యర్థ ప్రయాస చూస్తూ ఉంటే నాకు భీమసేన మహారాజు జ్ఞాపకం వస్తున్నాడు. నీలాగే ఆయనకూడా తలకు మించిన పనికి పూనుకుని చివరకు విఫలుడయాడు. శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీ కా కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

"ప్రాగ్జ్యోతిష నగరంలో పౌండ్రకు డనే మహా విద్వాంసుడుండేవాడు. ఆయన సమస్త శాస్త్రాలూ చదివినవాడు. కోరి నట్టయితే ఆయనకు రాజాశ్రయం సులువుగా లభించి ఉండేదే. కాని, ఎక్కడ చూసినా రాజధర్మం అడుగంటినట్టు కనిపించటంచేత పౌండ్రకుడు స్వతంత్రంగా బతకగోరి మంత్ర శాస్త్రంలో కృషిచేసి అనేక అసాధారణ

బేతాళ కథలు



శక్తులు సంపాదించుకున్నాడు. ఇంతేగాక హిమాలయాలకు వెళ్ళి అక్కడి గుహలలో కూచుని యోగవిద్య అభ్యసించి అనేక సిద్ధులు సాధించాడు. ఆ తరవాత అతను ప్రజలకు తన అద్భుత శక్తులను ప్రదర్శించి చూపుతూ వచ్చాడు.

కాలక్రమాన పాంద్రకుడి ఖ్యాతి ఆ దేశపు రాజైన భీమసేనమహారాజుకు తెలియ వచ్చింది. ఆయన పాంద్రకుణ్ణి పిలిపించాడు. రాజాజ్ఞ గదా అని పాంద్రకుడు వచ్చాడు. వెంటనే భీమసేనమహారాజు పాంద్రకుణ్ణి చీకటి కొట్టులో బంధింప జేసి అన్నపానాలు లేకుండా ఏడాదిపాటు ఖైదు చేశాడు. ఏడాది అయినాక చీకటి కొట్టు తలుపులు తెరవగా పాంద్రకుడు చచ్చిపోలేదు సరికదా, ముప్పూటలా సుష్టుగా భోంచేస్తున్న వాడిలాగా, మిసమిసలాడుతూ, నవ్వు ముఖంతో బయటికి వచ్చాడు.

పాంద్రకుడు మంత్ర సిద్ధిగలవాడని భీమసేనమహారాజుకు స్పష్టంగా తెలిసిపోయింది. ఏడాదిపాటు అన్నమూ నీరూ లేకుండా ఉన్నవాడు దేనికైనా సమర్థుడే. అందుచేత భీమసేనమహారాజు పాంద్రకుణ్ణి ఎలాగైనా నిర్మూలించాలని నిశ్చయించుకున్నాడు.

పాంద్రకుడు రాజుతో, "ఇక నాకు సెలవిప్పించండి," అన్నాడు.

"ఎందుకు వెళ్ళి పోవటం?" అన్నాడు భీమసేనమహారాజు.

"ఇక్కడ ఉంటే మీరు నా ప్రాణాలు తీస్తారు గనక!" అన్నాడు పాంద్రకుడు.

"అదేమీ లేదు. వెళ్ళాలని ఉంటే అలాగే వెళ్ళవచ్చు. భోజనం చేసి మరీ వెళ్ళు," అన్నాడు రాజు.

భోజనాలు చేసేటప్పుడు పాంద్రకుడు పాయసం గిన్నెను దగ్గిరికి తీసుకుంటూ, "ఇది మనిద్దరమూ చెరి సగమూ తాగాలని నా కోరిక," అన్నాడు.



ఒక గిన్నెలో నుంచి ఇద్దరు తాగాలంటే ఎవరో ఒకరు ఎంగిలి పాయసం తాగాలి. ఈ పౌండ్రకుడు తన ఎంగిలి తాగమంటా డేమోనని భీమసేనమహారాజుకు అనుమానం కలిగింది. కాని పౌండ్రకుడు ఒక చంచా తీసుకుని పాయసాన్ని రెండుగా కోశాడు. ఆ తరవాత అందులో సగం తాను తాగి, "మిగిలినది మీరు తాగండి, మహారాజా," అన్నాడు.

భీమసేనమహారాజు పౌండ్రకుడి శక్తులకు అద్భుతం చెందికూడా పాయసాన్ని తాగటానికి పస్తాయించాడు.

అది గమనించి పౌండ్రకుడు, "పోనివ్వండి, అదికూడా నేనే తాగేస్తాను," అంటూ పాయసం గిన్నె ఖాళీ చేసి ఆ గిన్నెను పైకి ఎగరవేశాడు. ఆ గిన్నె దాదాపు కప్పుదాకా వెళ్ళి కొంతసేపటి వరకూ అక్కడే అటూ ఇటూ ఊగుతూ ఉండిపోయి తరవాత కింద పడిపోయింది.

ఈ వింతను చూసి భోజనాలు చేస్తున్న వారంతా నివ్వెరపోయారు. తీరా గిన్నె కింద పడినాక పౌండ్రకుడి కోసం చూస్తే అతను ఎక్కడా కనిపించలేదు.

పౌండ్రకుణ్ణి ఎలాగైనా చంపించి తీరాలన్న నిర్ణయం భీమసేనమహారాజుకు



మరింత బలంగా కలిగింది. అతన్ని పట్టుకు రమ్మని భటులను పంపాడు.

రాజభటులు పౌండ్రకుడి ఇంటికి వచ్చి వెతికారు. ఇది గ్రహించి పౌండ్రకుడు ఒక ఆవుగా మారి తన ఇంటి ముందుండే ఆవుల మందలో చేరిపోయాడు.

భటులు తెలివైన వాళ్ళు. వారు ఆవులను లెక్కించి, ఉండవలిసిన దానికన్న ఒకటి ఎక్కువ ఉన్నట్టు కనిపెట్టి, ఆ ఆవులతో, "రాజుగారు నీతో మాట్లాడాలని మాత్రమే కోరుతున్నారు. భయపడక నీ నిజరూపం ధరించు," అన్నారు. అప్పుడొక ఆవు మందలో నుంచి ముందుకు వచ్చి, మనిషి





గొంతుతో, "ఇది నిజమేనా?" అని అడిగింది. ఆ ఆవే పొండ్రకుడై ఉంటా డనుకుని భటులు దాన్ని పట్టుకోబోయారు. అంతలోనే ఆవులన్నీ ముందుకు వచ్చి, "ఇది నిజమేనా?" అని అడిగాయి.

ఏ ఆవును తీసుకు పోవాలో తెలియక భటులు వచ్చిన దారి పట్టారు.

కొంతకాలం గడిచింది. రాజుగారి అను గ్రహం సంపాదించగోరిన వాడెవడో వెళ్ళి, "పొండ్రకుడు ఫలాని చోట ఉన్నాడు," అని చెప్పాడు. రాజు తన భటులను పంపాడు. పొండ్రకుడు కావాలనే వారికి దొరికిపోయాడు.

ఇలా దొరికిన పొండ్రకుణ్ణి రాజుగారు ఖైదులో పెట్టించాడు. తరవాత అతన్ని చిత్రహింసలు చెయ్యటానికి భటులు రాగా వారికి ఇద్దరు పొండ్రకులు విడివిడిగా కని పించారు. వారిలో ఒకడు ఖైదు వెలపల ఉన్నాడు, రెండోవాడు ఖైదులోపల నిలబడి ఉన్నాడు.

భటులు వచ్చి ఈ మాట చెప్పేసరికి భీమసేనమహారాజుకు మండిపోయింది. "మీరా అధముణ్ణి వధ్యశిల వద్దకు తీసుకు పోయి తల తీసెయ్యండి," అని ఆయన ఆజ్ఞాపించాడు.

అయితే ఈ ఆజ్ఞ నిర్వర్తించే లోపుగా పొండ్రకుడు అదృశ్యమైపోయాడు.

వెంటనే నగర ద్వారాలన్నీ మూయించి పొండ్రకుడి కోసం నగరమంతా గాలించారు. పౌరులు కూడా రాజభటులకు తోడ్పడ్డారు. "ఆ మనిషి ఎలా ఉంటాడు?" అని పౌరులు అడిగితే రాజభటులు పొండ్రకుణ్ణి వర్ణించి చెప్పారు. కాని అదే వర్ణనకు సరి పోయేవాళ్ళు వందల సంఖ్యలో పౌరులకు కనపడసాగారు. ఎవరిని పట్టుకోవాలో వారికి తెలియలేదు.

ఈ సంగతి విని భీమసేనుడు, "పొండ్ర కుడిలాగా కనిపించిన ప్రతి ఒక్కణ్ణీ

చంపండి," అని తన భటులకు ఉత్తరు విచ్చాడు. భటులు పాంద్రకుడి లాటివాణ్ణి ఒకణ్ణి చంపి గోతంలో వేసి తీసుకుని రాజు గారి ఎదట పెట్టారు. గోతం విప్పి చూస్తే దాని నిండా గడ్డీ, పీచూ కనిపించాయిగాని శవం లేదు.

ఇన్నిసార్లు అపజయం పొందినప్పటికీ పాంద్రకుణ్ణి చంపించాలన్న నిర్ణయాన్ని భీమసేనమహారాజు మార్చుకోలేదు. ఆయన తన సేనానాయకుణ్ణి పిలిచి, "నీవు పదివేల మంది సైనికులను వెంట పెట్టుకుని బయలుదేరి, ఎలాగైనా ఆ పాంద్రకుణ్ణి చంపి రా," అని అజ్ఞాపించాడు.

సేనానాయకుడు తన సేనతో సహా దేశాటన ప్రారంభించాడు. ఆయన ఒక మైదానంలో విడిసి ఉండగా పాంద్రకుడు సేనాపతి గుడారం ముందుకు వచ్చి నిల బడ్డాడు. ఆయన ఒక చేతిలో చట్టీ, రెండో చేతిలో ఒక సంచీ ఉన్నాయి. ఆయన వాటిని కింద పెట్టి, "సేనాపతీ, నేను పాంద్రకుణ్ణి. నీకూ, నీ సైనికులకూ విందు చెయ్యటానికి ఈ సారా, ఈ భోజనమూ తెచ్చాను," అన్నాడు.

పాంద్రకుడు తన మంత్రశక్తిని ప్రదర్శించ బోతున్నాడని సేనాపతికి అర్థమయింది. ఆయన ఆ శక్తులను గురించి



విని ఉన్నాడు గాని స్వయంగా చూడలేదు. అందుచేత ఆయన పాంద్రకుడితో, "విందు చెయ్యండి, కాని మేము పదివేల మందిమి ఉన్నాం," అన్నాడు.

"ఫరవా లేదు. ఒక్కొక్కరినే రమ్మనండి," అన్నాడు పాంద్రకుడు. ఆ చట్టిలో నుంచి ఎంత సారా తీసినా ఇంకా వస్తూనే ఉన్నది. అలాగే సంచీలో నుంచి ఎంత ఆహారం తీసినా వస్తూనే ఉన్నది. సైనికులందరికీ పూర్తిగా కైపెక్కింది. వారు ఆ చట్టినీ, సంచీనీ కాజేద్దామని యత్నించారు. కాని ఎంత మంది పట్టిలాగినా అవి రెండూ భూమికి కరుచుకుపోయి కదలలేదు.

"ఇంత మహిమగలవాణ్ణి నేను చంపటమేమిటి?" అనుకుని సేనాపతి పాంద్రకుణ్ణి తన దారిన వెళ్ళి పోనిచ్చాడు.

ఇది జరిగిన కొన్నాళ్ళకు ఒకనాటి సాయంకాలం భీమసేనమహారాజు ఒంటరిగా ఉన్న సమయంలో పాంద్రకుడు ప్రత్యక్షమై, "మహారాజా, అలా ఉద్యానవనం కేసి వాహ్యాళి పోదామా?" అని అడిగాడు.

"నీవు నడుస్తూ ఉండు. నేను వెనకటితే గుర్రం మీద వస్తాను," అన్నాడు భీమసేన మహారాజు. తరవాత ఆయన తన కత్తిని తీసుకుని గుర్రమెక్కి బయలుదేరాడు.



రాజు కొంతదూరం వెళ్ళాక ముందు నడుస్తూ పాంద్రకుడు కనిపించాడు. దారి నిర్మానుష్యంగా ఉన్నది. దబ్బున పాంద్రకుణ్ణి సమీపించి తన కత్తితో అతని తల నరికేద్దామని రాజు గుర్రాన్ని మరింత వేగంగా తోలాడు. పాంద్రకుడు పావు కోళ్ళు ధరించి నింపాదిగానే నడుస్తున్నప్పటికీ రాజు గారి గుర్రం అతన్ని చేరుకోలేక పోయింది. అతివేగంతో అది చాలాసేపు పరిగెత్తి నురుగులు కక్కుతూ పడిపోయింది. రాజు కూడా దానితోబాటే స్పృహ తప్పి పడిపోయాడు. పాంద్రకుడు ఏమైనదీ ఎవరికీ తెలియదు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నా కొక్క సందేహం. పాండ్రకుడి శక్తులు తనకు అతీతమైనవని భీమసేనరాజుకు మొదటనే తెలిసి ఉండాలి. మందమతి అనుకున్నా రెండోసారి తెలిసి ఉండాలి. ఆ సంగతి తెలిసికూడా ఆయన పాండ్రకుణ్ణి రూపు మాపటానికి అన్ని యత్నాలు ఎందుకు చేశాడు? తన సేనానాయకుడు గ్రహించిన సంగతి రాజు గ్రహించనేలేదా? గ్రహించితే ఆ ప్రయత్నం ఆయన ఎందుకు మానుకో లేదు? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపో తుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఒక్క అను భవమూ కలగక ముందే భీమసేనమహా రాజుకు పాండ్రకుడి శక్తి తన శక్తులన్నిటినీ మించినదని తెలుసు. అందుచేతనే మొట్ట మొదటి నుంచీ ఆయన పాండ్రకుణ్ణి చంప టానికే యత్నించాడు. ఆయన అలా చెయ్యటంలో వింత ఏమీలేదు. తన రాజ్యంలో తనను మించిన శక్తిమంతు డున్నంత కాలమూ ఏ రాజూ సహించలేడు. ఏ రాజ్యంలోనైనా సర్వశక్తి సంపన్నుడు రాజే అయి ఉండాలి. అలా కాని పక్షంలో అతని పరిపాలన అపహాస్యం పాలవుతుంది. అందుచేత భీమసేనమహారాజు పాండ్రకుణ్ణి నిర్మూలించ యత్నించటం సహజమే. ఆయన యత్నాన్ని వ్యర్థ యత్న మనటానికి కూడా లేదు. ఎందుకంటే, ఎంత సిద్ధ పురుషులైనప్పటికీ చిరంజీవులు కారు. మరణం వారికి ఎప్పటికైనా రాసి పెట్టే ఉంటుంది. ఆ మరణం తనకు అను కూలంగా ఉండగలందులకే భీమసేనమహా రాజు ప్రయత్నించాడు. అందులోకూడా తప్పేమీ లేదు," అన్నాడు.

రాజుకు ఇలా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# రాజైన బానిసపిల్ల

## 3

దొంగల నుంచి తప్పించుకుపోయిన జముర్రుద్ చీకటి పడినదాకా ఆగకుండా స్వారి చేసింది. మళ్లీ మర్నాడు ఉదయమే గుర్ర మెక్కి రోజల్లా ప్రయాణించింది; దారిలో దుంపలు తవ్వి తిని కడుపు నింపుకోవటానికీ, గుర్రాన్ని మేతకు విడవటానికీ తప్ప ఆమె ఆగనే లేదు. పదిరోజు లీవిధంగా ఇసుక ఎడారిలో పడి ప్రయాణించినాక ఆమెకు మళ్ళీ సస్యశ్యామల ప్రదేశం కంట పడింది. ఎక్కడ చూసినా పచ్చికబయళ్ళూ, సెలయేళ్ళూ, చెట్లూ, పూలూ, నీడలూ కనిపించి ఆమె కళ్ళు తనిశాయి. జముర్రుద్ ఈ ప్రదేశంలో కొంత సేపు విశ్రాంతి తీసుకుని, మళ్ళీ గుర్రమెక్కి ఒక రహదారి వెంట వెళ్ళి ఒక మహానగరం చేరుకున్నది. ఆమె నగర ద్వారాన్ని చేర వచ్చేసరికి అక్కడ జనం తండోపతండాలుగా చేరి ఉండి, ఆమెను చూసి వెర్రిగా హర్షధ్వానాలు చేస్తున్నారు.

అంతలోనే నగర ద్వారం తెరుచుకున్నది. నగరపు పెద్దలూ, కులీనులూ గుర్రా లెక్కి ఆమెకు ఎదురు వచ్చి, రాజుగారికి సభికులు వందనాలు చేసే రీతిగా, వంగి సలాములు చేశారు. ఇదే సమయంలో జనం, "సుల్తానుగారికి జై!" అని నినాదాలు చేశారు. రక్షకభటులు వచ్చి జనాన్ని దూరంగా ఉంచారు.

పురుష వేషంలో ఉన్న జముర్రుద్‌కు ఇదంతా అగమ్యగోచరంగా ఉంది. ఆమె నగరపు పెద్దల కేసి తిరిగి, "అయ్యలారా, మీ నగరంలో ఈ జాతర దేనికి? మీకు నాతో ఏం పని?" అని అడిగింది.

సి. మాధవరావు



"స్వామీ, మా నగరాన్ని పరిపాలించమని అల్లా తమరిని పంపాడు. ఆయన సర్వజ్ఞుడు. అందుచేతనే మాకు తమలాటి యువకుడైన కులీనుణ్ణి రాజుగా నిర్ణయించాడు!" అన్నారు వారు.

వారిద్వారా జముౖరుద్ అక్కడి ఆచారం గురించి తెలుసుకున్నది. ఈ నగరాన్ని ఏలే రాజులు నిస్సంతుగా చనిపోవటం జరిగితే, అక్కడి ప్రజలు నగరం వెలపలికి వచ్చి, తమ నగరానికి వచ్చే మొట్టమొదటి మనిషిని రాజుగా ఎన్నుకుంటారు. ఈ ఆచారం ప్రకారం జముౖరుద్ తలవని తలంపుగా ఈ నగరానికి రాజయింది.



ఆమె తనలో కలిగే ఆశ్చర్య సంభ్రమాలను పైకి కనబడనివ్వక, బింకంగా వారితో, "నేనైనా కులీనుణ్ణేగాని సాదా మనిషిని కాను. ఇంట్లో పోట్లాడి ప్రపంచం చూడటానికి బయలుదేరి ఇలా వచ్చాను. దైవికంగా నేను మిమ్మల్ని పరిపాలించవలిసిన పరిస్థితి ఏర్పడింది గనక అందుకు సిద్ధంగానే ఉన్నాను," అన్నది.

ఈ మాట అని ఆమె తన గుర్రాన్ని ఊరేగింపులో ముందు పోనిచ్చింది. ఆమె వెనకగా నగరపు పెద్దలూ, ఉన్నతాధికార్లూ బయలుదేరారు.

ఊరేగింపు రాజభవనం ముందు ఆగిపోయింది. జముౖరుద్ భవనం ప్రవేశించి రాచదుస్తులు ధరించింది. ఆమెను సింహాసనం పై కూచోబెట్టి అందరూ ఆమె ముందు సాష్టాంగ పడి రాజభక్తి ప్రమాణాలు చేశారు.

జముౖరుద్ ముందుగా ప్రజలకు దానధర్మాలు చేసింది. ఖజానాలో ఎంతో కాలంగా మూలుగుతున్న డబ్బును పేదసాదలకు పంచి పెట్టింది. రాజభవనంలోని నౌకర్లకు వస్త్ర దానాలు చేసింది. పెద్ద అధికార్ల కందరికీ కానుక లిచ్చింది. అందరూ ఆమెను వెయ్యేళ్ళు పరిపాలించమని దీవించారు. తమ రాజు ఆడదని

వారికి ఏపాటి అనుమానమూ కలగలేదు. ఆమె పరస్త్రీలను, కన్నెత్తికూడా చూడక పోవటం గమనించి, "ఆహా! మన సుల్తాను ఎంత నీతి పరుడు!" అని మెచ్చుకున్నారు.

ఇంత జరిగినా ఆమెకు ఆనందం లేక పోయింది. ఆమె తన భర్త అయిన అలీ షార్‌ను ఒక్క క్షణం కూడా మరవలేదు. అతని కోసం ఆమె రహస్యంగా జరిపించిన అన్వేషణలన్నీ విఫలమయాయి. అలీషార్ తనకు మళ్ళీ కనిపించగలందులకు ఆమె ఉపవాసాలు చేసింది, అంతులేని ప్రార్థనలు చేసింది. "మన సుల్తానుగారిది ఎలాటి దైవభక్తి!" అనుకున్నారు నౌకర్లు.




ఒక సంవత్సరం గడిచాక జముర్రుద్‌కు ఒక ఆలోచన కలిగింది. ఆమె నగరంలో ఒక విశాలమైన ప్రదేశం ఖాళీ చేయించింది. నగరవాసులందరూ కూచుని విందు భోజనం చెయ్యటానికి వీలయినంత పెద్ద మండపం కట్టించింది. అందులో ఒక పక్కగా సింహాసనమూ, మంత్రులు మొదలైనవారి ఆసనాలూ ఉన్నాయి. మిగిలిన స్థల మంతటా సామాన్య ప్రజలకు ఆసనాలు అమర్చారు.

"ఇది మొదలు ప్రతి నెలా మొదటి రోజున ఈ మంటపంలో సమారాధాన విందు చేస్తాం. ఆ రోజు నగరంలోని యావన్మంది పురుషులూ వచ్చి భోజనం చెయ్యాలి. రానివారికి శిరశ్ఛేద శిక్ష. ఈ విధంగా చాటింపు వేయించండి," అని ఆమె తన మంత్రులకు చెప్పింది.

అలాగే చాటింపు వేశారు. మరుసటి నెల మొదటి రోజున నగరంలోని ధనికులూ, పేదలూ, వర్తకులూ బిచ్చగాళ్ళూ మంట పానికి వచ్చి విందుకు కూచున్నారు. బల్లల మీద రకరకాల వంటకాలు పెట్టి ఉన్నాయి. ఎవరి ఆసనాలకు సమీపంలో ఉండే వంట కాలను వారు అంది తీసుకుంటున్నారు.

విందు జరుగుతున్నంతసేపూ జముర్రుద్ ప్రతి మనిషినీ పరకాయించి చూస్తూ

వచ్చింది. "సుల్తానువారు నా కేసి అంత పరీక్షగా ఎందుకు చూస్తున్నారో!" అని చాలామంది ఆశ్చర్య పడ్డారు. "ఆహా! ప్రజలపై ఇంత అభిమానం గల రాజులు కూడా ప్రపంచంలో ఉంటారా! ఏమి విందు!" అని చాలామంది అనుకున్నారు.

ఆ రోజు దైవికంగా ఆ విందులో పాల్గొంటున్న వారిలో అలీషార్‌కు మత్తు మందు పెట్టి జముర్రుద్‌ను తస్కరించిన బర్సూమ్ కూడా ఉన్నాడు. ఆ నీచుడు తనకు అందుబాటులో ఉండే వంటకాలన్నీ అంది పుచ్చుకుని ఆత్రంగా తినేసి, దగ్గిరలో ఏమీ లేకపోయేసరికి, దూరంగా ఉన్న ఒక పళ్ళెం అందుకుని అందులో ఉన్న మీగడ హల్వా పట్టెడు తీసి నోట కుక్కుకున్నాడు.

ఈ చర్య చూసి బర్సూమ్‌కు అటూ ఇటూ కూచున్నవాళ్ళకు రోత కలిగింది. "ఎవరయ్యా నువ్వూ? నీకు అతిథి మర్యాద కూడా తెలియదే! అందుబాటులో ఉన్నది తింటారుగాని కనిపించిన దల్లా తీసుకు తింటారా?...అంతా ఒక్కడివే బొక్కేస్తున్నావు, కడుపు నొప్పి వచ్చేను!" అని నానా మాటలూ అన్నారు.

ఎవరేమన్నప్పటికీ వినిపించుకోకుండా బర్సూమ్ మరొక పట్టెడు హల్వా తీసుకుని నోట పెట్టుకోబోతుండగా జముర్రుద్ అతన్ని



గుర్తించి, "ఆ హల్వా తినే వాణ్ణి పట్టి తీసుకురండి!" అని భటులను అజ్ఞాపించింది. వాళ్ళు వచ్చి బర్సూమ్ మీదపడి, కింద పడేసి జరజరా ఈడ్చుకుపోయారు.

ఈ సంఘటన అందనీ ఆశ్చర్య చకితులను చేసింది.

జముర్రుద్, బర్సూమ్‌ను చూసి కళ్ళ నిప్పులు రాలుస్తూ, "ఏమిరా? నీ పేరేమిటి? నువు మా నగరానికి ఏం పని మీద వచ్చావు?" అని అడిగింది.

"మహారాజా, నా పేరు అలీ. నేను జల్తారు పనివాణ్ణి. వర్తకం కోసం తమ నగరానికి వచ్చాను," అన్నాడు బర్సూమ్.

జముర్రుద్ తన నౌకరు చేత తన వద్ద ఉండే ఇసుక పెట్టే, రాగి పుల్లా తెప్పించింది. ఇసుకలో ఏవో పిచ్చి గీతలు గీసింది. వాటిని నిదానంగా పరిశీలించినట్టు నటించింది. చివరకు బర్సూమ్ కేసి తిరిగి రౌద్రకంఠంతో, "నా తోనే అబద్ధాలాడతావురా, బద్మాష్? నీ అసలు పేరు బర్సూమ్ కాదూ? నువొక బానిసపిల్లను మాయ చేసి ఎత్తుకు పోలేదూ? దాన్ని వెతుకుతూ కాదూ నీ వీ నగరం వచ్చిందీ?" అని కేకలు పెట్టింది.

బర్సూమ్ వణికిపోతూ ఆమె కాళ్ళపైన పడి, అంతా నిజమేనని ఒప్పుకున్నాడు. ఇది చూసి ప్రజలందరూ ఆశ్చర్య చకితులై





హాహాకారాలు చేసి, "మన ప్రభువులాటి దైవజ్ఞులు ప్రపంచంలో మరెక్కడైనా ఉంటారా!" అన్నారు.

జముర్రుద్ తన భటులను పిలిచి, "ఈ నీచుణ్ణి చిత్రవధ చెయ్యండి!" అని ఆజ్ఞాపించింది. జనులు ఆమె ఇచ్చిన శిక్ష సరి అయినదని ప్రశంసించారు.

బర్సూమ్ సమీపంగా కూచుని భోజనం చేసినవారు మీగడ హల్వా జన్మలో తినమని ఒట్లు పెట్టుకున్నారు. అదే బర్సూమ్ చావుకు కారణమయిందని వారి అనుమానం!

అందుచేత మరసటి నెల ఆరంభంలో తిరిగి విందు జరిగినప్పుడు మీగడ హల్వా పళ్ళెం ఉన్న చాయల ఎవరూ కూచోలేదు. దాని కేసి ఎవరూ చూడనైనా లేదు. సుల్తాను తమ కేసి పరీక్షగా చూస్తూ ఉండటం గమనించి ప్రతి ఒక్కరూ తమ కెదురుగా ఉండే తినుబండారాలు మాత్రమే తిన్నారు.

విందు సాగుతూన్న సమయంలో ఒక మొరటు మనిషి అక్కడికి వచ్చాడు. ఖాళీ స్థలం కోసం చాలాసేపు వెతికిన మీదట మీగడ హల్వా పళ్ళెం ఎదురుగా ఖాళీ దొరికింది. వాడు అక్కడ కూచుని ఆ పళ్ళెం తన కేసి లాక్కున్నాడు.

ఈ వచ్చిన వాడు జవాన్ అన్న దొంగ. తన తల్లిని మభ్యపెట్టి పారిపోయిన జముర్రుద్‌ను వెతుక్కుంటూ వాడీ నగరం వచ్చి విందుకు హాజరయాడు. వాణ్ణి చూస్తూనే జముర్రుద్ గుర్తించి, వాణ్ణి ఈడ్చుకు రమ్మని తన భటులను పంపింది. జవాన్ ఒక పట్టెడు హల్వా నోట వేసుకుని దిగమింగి, రెండో పట్టు పట్టుతూండగా భటులు వాడి పైన పడి, క్షణంలో పెడరెక్కలు విరిచికట్టి తమ సుల్తాను దగ్గిరికి ఈడ్చుకుపోయారు.

"నువెవరు? ఏం చేస్తావు? ఎందుకు మా నగరానికి వచ్చావు?" అని జముర్రుద్ వాణ్ణి ప్రశ్నించింది.





"నా పేరు ఉథ్మాన్. తోటమాలిని. పని కోసం ఈ నగరం వచ్చాను," అన్నాడు జవాన్. జముర్రుద్ వెనకటిలాగే ఇసుకా, రాగి పుల్లా తెప్పించి, ఏదో గీతలు గీసి, వాటిని పరీక్షించినట్టు నటించి, "ఓరి లుచ్ఛా, నీ పేరు జవాన్. నువు దొంగ తనాలూ, హత్యలూ చేసే వాడివి. నిజం ఒప్పుకుంటావా? చావ గొట్టించమన్నావా?" అని అడిగింది.

తనతో మాట్లాడుతున్నది తాను ఎత్తుకు పోయిన పిల్లే నన్న అనుమానం వాడికి కలగ లేదు. వాడు భయంతో పాలిపోయి, తోడేలు లాటి నోరు తెరిచి వగర్చుతూ, "తమరన్నది నిజమే, ప్రభూ. ఇక నుంచీ నా బ్రతుకు మార్చుకుంటాను," అన్నాడు.

"నిన్ను బతకనివ్వటం ధర్మహాని! వీణ్ణి తీసుకుపోయి చిత్రవధ చెయ్యండి," అని జముర్రుద్ భటులను ఆజ్ఞాపించింది.

రెండోసారి కూడా ఇలాగే జరగటంతో జనానికి ఆ మీగడహల్వా అంటే హడలెత్తి పోయింది. దాన్ని తాకిన వాడికి చావు తథ్య మన్న అభిప్రాయం జనంలో పాకిపోయింది.

అందుచేత మరొక నెల గడిచి మరొక విందు జరిగినప్పుడు జనం ఆ హల్వా పళ్ళానికి సాధ్యమైనంత ఎడంగా కూచు న్నారు. దానిముందు ఒక్కరూ కూచోలేదు.

ఆ రోజు అక్కడికి ఒక తెల్ల గడ్డం ముస లాడు వచ్చాడు. విందులో పాల్గొననివాళ్ళని ఉరితీస్తారని ఈ ముసలాడికి తెలుసు. కాని ఎక్కడా చోటు లేదు. అందుచేత వాడు వచ్చి హల్వా పళ్ళెం ముందున్న ఖాళీ జాగాలో కూచున్నాడు.

ఈ వచ్చినవాడు రషీద్—జముర్రుద్‌ను వేలంలో కొనటానికి యత్నించి, సాధ్యంకాక, ఆవిడను ఎత్తుకు రావటానికి తన తమ్ము డైన బర్సూమ్‌ను నియోగించిన నీచుడు. ఆమెను వెతకటానికి వెళ్ళిన తన తమ్ముడు నెల గడిచినా తిరిగి రాకపోవటం చూసి రషీద్ తానే ఈ నగరానికి చేరుకున్నాడు.



మీగడహల్వా పళ్ళెం ముందున్న స్థలంలో కూచుంటూండగానే రషీద్‌ను జముర్రుద్ పోల్చింది. "ఈ మీగడహల్వా మహిమ ఏమిటో గాని పనికిమాలిన లుచ్చాలందరినీ ఇది ఆకర్షిస్తోంది," అని ఆమె అనుకుని, రషీద్‌ను పట్టి లాక్కురమ్మని తన భటులను పంపింది. వాళ్ళు వెళ్ళి రషీద్‌ను కిందపడేసి, గడ్డం పట్టుకుని ఈడ్చుకు వచ్చి జముర్రుద్ ఎదట పెట్టారు.

"నీ పేరేమిటి? వృత్తి ఏమిటి? ఈ నగరానికేం పని మీద వచ్చావు?" అని ఆమె రషీద్‌ను అడిగింది.

"ప్రభూ, నా పేరు రుస్తుం. నాకు దారిద్ర్యం తప్ప వేరే వృత్తి లేదు. నేను ఫకీరును," అన్నాడు రషీద్.

జముర్రుద్ ఇసుక తెప్పించి, గీతలు గీసి, వాటిని పరీక్షించినట్టు నటించింది. తరవాత రషీద్ కేసి తిరిగి, "కుక్కా, రాజుతోనే అబద్ధాలాడావు. నీ అసలు పేరు రషీద్ అల్దీన్. ముస్లిము స్త్రీలను బలాత్కరించటం నీ వృత్తి. నిజం ఒప్పుకో!" అన్నది.

లేకపోతే ప్రాణాలు దక్కవని రషీద్ నిజం ఒప్పేసుకున్నాడు. కాని జముర్రుద్ వాడికి చిత్రవధే విధించింది.

విందు యథావిధిగా ముగిసింది. తమ యేలిక యొక్క సామర్థ్యాన్ని ప్రజలు తెగ మెచ్చుకున్నారు.

విందు ముగిసినాక జముర్రుద్ తన భవనానికి తిరిగి పోయింది. తన శత్రువుల పైన పగ తీర్చుకున్నందుకు ఆమె మనసు తేలికపడిందేగాని ఆనందం కలగలేదు. అలీషార్ దొరికితేగాని ఆమెకు ఆనందం కలగదు.

"నా కోరిక తీర్చే భారం ఆ సర్వశక్తిమంతుడైన దేవుడి పైనే ఉన్నది," అనుకుంటూ ఆమె ఆ రాత్రంతా కన్నీరు కార్చి, ఆ నెల అంతా తన రహస్య మందిరంలోనే ఉండిపోయి ఎవరికీ తన ముఖం చూపలేదు. —(ముగింపు వచ్చే సంచికలో)






# నౌకరు బదిలీ

గొప్పకోసం జమీందారుగారు తన అల్లుడైన గుండుభీమన్న దగ్గిర ఒక నౌకరు కుర్రాణ్ణి ఏర్పాటు చేశారన్నమాటే గాని ఆ కుర్రాడికి పని ఏమీ ఉండేదికాదు. అసలే కోతి, అందులో పనికూడా లేదు. అందుచేత భీమన్న నౌకరు అస్తమానం గోడలమీదా, గొబ్బెలమీదా, కుర్చీలమీదా, మెట్లమీదా ఎక్కి దూకుతూ ఉండేవాడు.

తన నౌకరు ఇలా అస్తమానమూ కోతి లాగా గెంతుతూంటే భీమన్నకు సరదాగానే ఉండేది. కాని జమీందారుగారికి మటుకు చిరాకు కలిగేది. అల్లుడుగారి నౌకరుగదా అల్లుడుగారే వాణ్ణి అదుపులో పెడతాడు లెమ్మని ఆయన అనుకునేవాడు. అల్లుడు గారు సమీపంలో లేని సమయాల్లోమటుకు, "నీకు కాలూ చెయ్యీ ఊరుకోదురా? క్షణమైనా కుదురుగా ఉండలేవేం?" అని కసిరేవాడు. కుర్రకుంక ఈ కసుర్లు పట్టించుకునేవాడుకాడు; అయనకు కనిపించకుండా వెళ్ళి మళ్ళీ తన ఆనందం కొద్దీ గెంతేవాడు.

ఇలా ఉండగా ఒకనాడు గుండుభీమన్న సమక్షంలోనే నౌకరు కుర్రాడు గెంతుతూండటమూ, గుండుభీమన్న వాణ్ణి పల్లెత్తు మాట అనకపోవటమూ జమీందారుగారు తన కళ్ళారా చూశాడు. ఆయన కుర్రాణ్ణి అవతలికి తరిమేసి భీమన్నతో, "ఈ కుర్ర కుంకను ఇలాగే చూస్తూ ఊరుకుంటే నెత్తి నెక్కి కూచుంటాడు. జాగ్రత్త!" అని చెప్పి హెచ్చరిక చేశాడు.

ఈ మాట వినగానే భీమన్నకు దిగులు పట్టుకున్నది. "మామగారు చెప్పిన మాట నిజమే అయి ఉంటుంది. నా నెత్తిన ఎక్కి కూచోపటానికే ఈ కుర్ర వెధవ ఎక్కటమూ, దూకటమూ అభ్యాసం చేస్తున్నాడు. ఎలాగైనా వీడు నా నెత్తిన ఎక్కి కూచోకుండా చూసుకోవాలి. లేకపోతే మామగారు నొచ్చు



కుంటారు," అనుకుని భీమన్న ఒక ఉపాయం చేశాడు. నౌకరును పిలవ వలిసి వచ్చినప్పుడల్లా ముందుగా నెత్తిన ఒక పెద్ద తలపాగా పెట్టుకుని, దానిమీద చేతులుంచుకుని, నౌకరును పిలిచి, వాడికి చెప్పవలిసిన పని చెప్పి, వాడు వెళ్ళినాక నెత్తి మీది నుంచి తన చేతులూ, తలపాగా తీసేసేవాడు. అప్పటికీ వాడు నెత్తిన ఎక్కి కూచుంటాడేమోనని, కుర్రాడు వెళ్ళిపోయేదాకా ఒక చోట కూచోక, భీమన్న అటూ ఇటూ పచార్లు చేస్తూ కుర్రాడితో మాట్లాడేవాడు.

ఒకనాడు భీమన్న నెత్తిన పెద్ద తలపాగా, దాని పైన తన చేతులూ పెట్టుకుని అటూ ఇటూ పచారు చేస్తూ ఏదో పని చెబుతూండటం మహలక్ష్మి కంట పడింది. ఆమె తన భర్తను, "ఈ తలపాగా ఏమిటండీ?" అని అడిగింది.

నౌకరు కుర్రాణ్ణి పంపేసి భీమన్న తన భార్యతో, "నీకేం తెలుసు? చూస్తుండగానే ఈ కుర్రాడు నా నెత్తిన ఎక్కి కూచుంటాడట. మామగారు చెప్పారు. అనుభవం ఉన్నవారు గనక ఆయన బాగా కనిపెట్టారు. ఆయన అన్నది అక్షరాలా నిజమే. ఎంచేతనంటే వీడు నా నెత్తిన ఎక్కి కూచోవటానికే అవీ ఇవీ ఎక్కి దూకటం అభ్యాసం చేస్తున్నాడు. నేను జాగ్రత్తగా కనిపెడుతున్నానుగా!" అన్నాడు.

మహలక్ష్మి నవ్వి, "నాన్నగారి ఉద్దేశం అదికాదు. చనువిస్తే కుర్రాడికి గర్వం వచ్చి చెప్పిన మాట వినడని. అంతేగాని వాడు మీ నెత్తి మీదికి ఎక్కనే ఎక్కడు భయపడకండి," అన్నది భర్తతో.

భీమన్నకు పెద్ద బరువు దించేసినట్టయింది. తను చెప్పేది కుర్రవాడికి వినపడని పరిస్థితి ఇంకా రాలేదు. వాడు తన నెత్తి మీద ఎక్కి కూచోడని మహలక్ష్మి నమ్మకంగా చెప్పేసింది. అందుచేత భీమన్న కుర్రాడితో ఎప్పటిలాగే ఉండసాగాడు.

ఒకనాడు భీమన్న కుర్రాణ్ణి పిలిచి కాసిని నీళ్ళు పట్టుకురమ్మన్నాడు. కుర్రాడు చిన్న లోటాలో నీళ్ళు తెచ్చాడు.

"అవి చాలవురా! కాస్త పెద్ద చెంబుతో పట్రా!" అన్నాడు భీమన్న.

"ఆ మాట మొదటే చెబితే చెంబుతోనే తెచ్చేవాణ్ణిగా?" అన్నాడు కుర్రాడు.

అయితే కుర్రాడు భీమన్నతో అన్న ఈ మాట, అటుగా వెళుతున్న జమీందారు గారికి వినిపించింది. ఆయన భీమన్న దగ్గిరికి వచ్చి, "ఆ కుర్రకుంకను అలా ఎదురు జవాబు చెప్పనివ్వవచ్చా? ఇలా చేస్తేనే వాడు నెత్తికెక్కేది!" అని గట్టిగా హెచ్చరించాడు.

భీమన్న మామగారితో, "వాడు నెత్తి కెక్కడుట లెండి. ఆ మధ్య మహలక్ష్మి నాతో చెప్పింది," అన్నాడు.

"దాని మొహం! చిన్నపిల్ల దానికేం తెలుసు? ఎదురు జవాబు చెప్పనిస్తే వాడు తప్పక నెత్తి కెక్కుతాడు!" అంటూ జమీం దారుగారు వెళ్ళిపోయాడు.

భీమన్నకి మళ్ళీ గుండెల్లో రాయిపడింది. మహలక్ష్మి తప్పు చెప్పింది. ఆమెకు ఏమీ తెలీదు. మామగారు చెప్పిందే నిజం. ఆయన పెద్దవాడు; అనుభవం గలవాడు.



అందుచేత కుర్రాడు తనకు ఎదురు జవాబు ఇవ్వకుండా చూసుకోవాలి.

అందుకని భీమన్న కుర్రాణ్ణి పిలిచి, "ఒరే, ఇకముందు నా కేదన్నా జవాబిచ్చే టప్పుడు నా కెదురుగా నిలబడక అటు తిరిగి నిలబడు, తెలిసిందా?" అన్నాడు.

కుర్రాడు బుర్ర గోక్కుని, "తెలవ లేదండీ!" అన్నాడు.

వాడికి చెప్పి లాభం లేదనుకుని భీమన్న వాడు మాట్లాడేటప్పుడల్లా తానే పెడ మొహం పెట్టి నిలబడేవాడు. కుర్రాడు తన ఎదటికి వచ్చి మాట్లాడటానికి యత్నించి నప్పుడల్లా భీమన్న మరొక పక్కకు తిరిగేవాడు.

ఒకనాడు ఈ వింత మహలక్ష్మి కళ్ళ పడింది. భీమన్న తన చుట్టూ తాను తిరుగుతూ కుర్రాణ్ణి ఏదో అడుగుతున్నాడు, కుర్రాడు భీమన్న చుట్టూ తిరుగుతూ జవాబు జెబుతున్నాడు! మహలక్ష్మి, "ఈ రంగుల రాట్నం ఏమిటండీ?" అని అడిగింది.

"మరేం లేదు. కుర్రాణ్ణి ఎదురు జవాబు ఇవ్వనివ్వ వద్దనీ, ఇవ్వ నిస్తే వాడు నిశ్చయంగా నా నెత్తి కెక్కుతాడనీ మామ గారు మళ్ళీ చెప్పారు. ఎదురుగా నిలబడి జవాబు చెప్పకురా అంటే కుర్ర వెధవకు అర్థం కావటంలేదు. వాడు నా ఎదటికే వచ్చి జవాబు చెబుతాడు. నా నెత్తిన ఎలాగైనా ఎక్కాలని వాడికి బాగా ఉన్నేట్టుంది. అందుచేత నేనే వాడికి పెడమొహ మవుతున్నాను. అంతకంటె ఏమీ లేదు," అన్నాడు భీమన్న తన భార్యతో.

ఈ మాటలు విని మహలక్ష్మి విరగబడి నవ్వి, "ఎదురు జవాబు లివ్వటమంటే ఎదురుగా నిలబడి జవాబు లివ్వటం కాదండీ. మంచీ మర్యాదా లేకుండా పొగరుగా జవాబివ్వటమన్నమాట. పని వాళ్ళు వినయ విధేయతలుగా ఉండాలని నాన్నగారి ఉద్దేశం," అన్నది.

"నీకేం తెలుసు? నువ్వింకా చిన్న దానివి. వాడు నా నెత్తి నెక్కడని నువు తెలీక అన్నావుట. మామగారు స్పష్టంగా చెప్పారు. పెద్దవారి మాట కాదనటం ఎట్లా?" అన్నాడు భీమన్న.

ఈ నౌకరు కుర్రాడి మూలంగా తన భర్త క్షోభపడి పోతున్నాడని మహలక్ష్మి గ్రహించి, "ఇదంతా ఎందుకు? ఈ కుర్ర కుంకను నా పనికి పెట్టుకుంటాను. మీకు మరో నౌకరును చూద్దాం లెండి," అన్నది.

"అలాగే చెయ్యి, నీకు పుణ్యం ఉంటుంది. వీడు వదిలితే చాలు, మరొకణ్ణి పెట్టుకున్నంత సుఖం," అన్నాడు భీమన్న.

(పై సంచికలో మరో సంఘటన)






# చేతగాని అనుకరణ

"అమ్మమ్మ చాలా చెడ్డది!" అని చిన్న వాడు ప్రచారం సాగించాడు.

"చూశావా, తాతయ్యా. మన చిన్నవాడు అమ్మమ్మ చాలా చెడ్డదంటున్నాడు?" అని మిగిలిన పిల్లలు తాతయ్యతో ఫిర్యాదు చేశారు. తాతయ్య పిల్లలతో పంచాయతీ జరిపి అసలు విషయం తెలుసుకున్నాడు: అమ్మమ్మ బుల్లివాడికి పావలా ఇచ్చిందిట, చిన్నవాడికి ఇవ్వలేదు. బుల్లివాడికి ఎందుకు పావలా ఇచ్చిందిటా? అమ్మమ్మకు కాళ్ళు తీప్పెడతాయిగాదూ, అందుచేత వసారాలో కూచుని కాళ్ళు ఒత్తుకుంటుంటే బుల్లివాడు వెళ్ళి, "నేను కాళ్ళు పట్టనా, అమ్మమ్మా?" అని కాళ్ళు పట్టుకున్నాట్ట. "మా నాయనే! నీ కెందుకురా శ్రమా? ఇంద, ఈ పావలా తీసుకుని ఏమన్నా కొనుక్కు తిను!" అన్నదిట. ఇదంతా చూస్తున్న చిన్నవాడు, "వాడి కన్న నేను బాగా నొక్కుతా నమ్మమ్మా!" అన్నాట్ట. అమ్మమ్మ వాణ్ణి కూడా వద్దన్నదిట, కాని వాడికి పావలా ఇవ్వలేదుట. అందుచేత అమ్మమ్మ చాలా చెడ్డదని వాడు పితూరీ లేవదీశాడు.

ఇదంతా విని తాతయ్య బోసినోటితో నవ్వి, ఒక చిటికెడు పొడుం పీల్చి, "ఒరే చిన్నవాడా! నీది చాతగాని అనుకరణరా! బుల్లివాడు బహుమానం సంపాదించినాకనే గద నీకు అమ్మమ్మకు సేవ చేయాలని పించింది? అటువంటప్పుడు నీకు అమ్మమ్మ కాదుగదా ఎవరూ బహుమానం ఇవ్వరు. మీకో కథ చెబుతాను కూచోండి," అన్నాడు.

"కథ, కథ!" అంటూ అంతా కూచున్నాక తాతయ్య కథ అరంభించాడు:

ఒక పల్లెటూళ్ళో ఒక పేదరైతు ఉండే వాడు. డబ్బు లేదు; బ్రతుకు భారమై పోయింది. పేదవాడికి ఎవరు సహాయం చేస్తారు? ఎంత కాలమని చేస్తారు? తన

దారిద్ర్యం తీరాలంటే రాజుగారే తీర్చా లనుకుని వాడు రాజుగారిని చూడటానికి ప్రయాణమయాడు.

మరి గొప్పవాళ్ళని చూడటానికి వెళ్ళా లంటే ఏదన్నా చేత పట్టుకుపోవాలి గాని, ఉత్త చేతులతో వెళ్ళరాదుగా? అందుచేత ఆ పేదరైతు తన దగ్గిర ఉన్న ఒకే ఒక కోడిని చంకన పెట్టుకుని రాజుగారిని చూడబోయాడు.

ఎలాగైతేనేం వాడికి రాజుగారి దర్శనం లభించింది. రైతు తాను తెచ్చిన కోడిని రాజుగారి ఎదట పెట్టి, తాను వచ్చిన పని కాస్తా చెప్పుకున్నాడు.

రాజుగారు అంతా విని నవ్వుతూ, రైతును ఏడిపించటానికి, "నువయితే ఈ కోడిని తెచ్చి ఇచ్చావుగాని, నేనూ, నా భార్యా, ఇద్దరమ్మాయిలూ, ఇద్దరబ్బా యిలూ, అంతా కలిసి ఆరుగురం ఉన్నాం గదా, ఈ కోడిని ఎలా పంచుకోవటం?" అన్నాడు. రైతు బీదవాడైతేనేం తెలివిగల వాడు. అందుచేత, "అదేం బ్రహ్మవిద్యా, మహారాజా? నా కొక కత్తి ఇప్పిస్తే నేను దీన్ని మీకు ఆరుగురికీ ఎలా పంచాలో అలా పంచేస్తాను," అన్నాడు.

రైతు ఎలా కోడిని ఆరుగురికీ పంచుతాడో చూడాలని రాజుగారికూడా కుతూహలం



కలిగింది. అంచేత కత్తి ఒకటి తెప్పించి రైతు కిప్పించాడు.

రైతు కోడి తల కోసి రాజుగారి ముందు పెడుతూ, "తమరు రాజ్యానికి తలలాటి వారు గనక ఈ కోడి తల మీ వంతు," అన్నాడు. తరవాత కోడి వీపు కోసి, "ఇది రాణీ గారిది. ఎందుచేతనంటే సంసార భారమంతా ఆమెగారి వీపే మోస్తుంది," అన్నాడు. తరవాత కోడి కాళ్ళు రెండూ కోసి, "ఇవి మీ కుమాళ్ళవి. ఎంచేతనంటే వారు తమ అడుగు జాడల్లో నడవవలిసిన వాళ్ళు," అన్నాడు. ఆ తరవాత కోడి రెక్కలు రెండూ కోసి, "ఇవి అమ్మాయి గార్లవి. ఎందుకంటే వారు ఏ నాటికైనా రెక్కలు కట్టుకుని ఎగిరి పోవలిసిన వారే. ఇంక మిగిలిన కోడి ఉంది చూశారూ, అది నాది. ఎందుకంటే నే నివాళ తమకు అతిథిని," అన్నాడు.

రైతు తెలివి తేటలకు మెచ్చుకుని రాజు వాడికి తగినంత ధన మిచ్చి ఇంటికి పంపేశాడు. ఈ సంగతి ఊరంతా పాక్కింది. ఆ ఊళ్ళోనే ఒక లోభి ఉన్నాడు. లోభికి ఆశ హెచ్చు అంటారు. ఈ లోభికి ఆశ హెచ్చేగాని తెలివితేటలు తక్కువ. రైతు లాగే తానుకూడా అదే పని చేసి రాజుగారి వద్ద ధనం పొందాలని ఆశ పుట్టుకొచ్చింది.



వెంటనే ఆ లోభి ఏం చేశాడూ? ఒకటి కాదు, ఐదు కోళ్ళను ఒక బుట్టలో పెట్టుకుని రాజుగారి దర్శనానికి వెళ్ళాడు.

వాణ్ణి చూడగానే రాజుగారికి వాడి దురాశ తెలిసిపోయింది. ఆయన నవ్వుతూ, "ఏమయ్యా, మేము ఆరుగుర మున్నాం గదా, అయిదు కోళ్ళు ఎలా పంచుకోమూ? వాటిని కొయ్యకుండా ఎలా పంచుతావో పంచు," అన్నాడు.

"అరెరె, మరో కోడినికూడా తెస్తే సరి పోయేది!" అని లోభి విచారించాడుగాని కోళ్ళను పంచటం చేతగాక గుడ్లు మిటకరించాడు.

అప్పుడు రాజుగారు ఆ లోభితో, "నువు పంచలేవు. అందుకు తగినవాడు రైతే. అతనెలా పంచుతాడో చూద్దాం," అంటూ రైతు కోసం కబురు పెట్టాడు.

రైతు వచ్చి పరిష్కరించవలిసిన సమస్య ఏమిటో రాజుగారి ద్వారా తెలుసుకుని ఇలా అన్నాడు. "ఈ ఐదు కోళ్ళను ఎలా పంచితే బాగుంటుందో నేను చెబుతాను. తమరికీ, రాణీగారికీ కలిపి ఒక కోడి; మీరిద్దరూ అదీ కలిసి ముగ్గురవుతారు. మీ ఇద్ద రబ్బాయిలకూ ఒక కోడి, ఆ ఇద్దరూ ఇదీ కలిసి ముగ్గురవుతారు. అదే విధంగా మీ ఇద్దరు అమ్మాయిలకూ ఒక కోడి నిస్తే వారూ అదీ కలిసి ముగ్గురవుతారు. పోతే ఇంకా రెండు కోళ్ళు మిగిలాయి. అవీ నేనూ కలిసి ముగ్గురమవుతాము, అందుచేత అవి నావి!"

ఈ పంపకం చూసి లోభి నిర్ఘాంత పోయాడు, రాజుగారు లోభి చూస్తుండగానే రైతుకు ఆ రెండు కోళ్ళతోబాటు బోలెడంత డబ్బు కూడా ఇచ్చి, లోభికి మాత్రం ఎర్ర ఏగాని ఇవ్వకుండా ఇంటికి పంపేశాడు.

"అందుకే మనవాళ్ళు తెలివొకరి సొమ్మా అన్నారు," అన్నాడు తాతయ్య. చిన్నబ్బాయి తప్ప అంతా గొల్లున నవ్వారు.

(ఆర్. జయపరెడ్డి కథ ఆధారంగా)





# దయ్యపు తిండి

ఒకనాటి రాత్రి చిత్రపురం రాజుగారు నోరు తెరుచుకుని గాఢ నిద్ర పోతూండగా ఒక పిశాచి అయన నోట ప్రవేశించింది. మర్నాడు లేస్తూనే ఆయన భరించలేని ఆకలితో లేచాడు. వంటవాళ్ళు మామూలుగా తెచ్చి పెట్టిన ఫలహారం ఆయనకు ధూపానికి రాలేదు. వంటవాళ్ళు నిర్ఘాంతపోయి రక రకాల వంటకాలు చేయ నారంభించారు. భటులు పళ్ళూ ఫలాలూ తెచ్చి రాజుగారికి అందించారు. తయారైన వంటకాలు వేడి వేడిగా తెచ్చి వంటవాళ్ళు ముందు పెడు తూంటే రాజుగారు వాటిని అమాంతం తినేశాడు. ఇరవై మంది తిన గలిగినంత ఆహారం తినగా రాజుగారి ఉదయపు ఫల హారం పూర్తి అయింది.

ఇక మధ్యాహ్న భోజనం విషయం చెప్పనే అక్కర్లేదు. వంటవాళ్ళు నాలుగు గొర్రెలను, ఒక డజను కోళ్ళనూ, మణుగు కూరలనూ, పది మానికల బియ్యాన్నీ వండి వార్చి సిద్ధంగా ఉన్నారు. రాజుగారు అదంతా ఒక్కడే తినేశాడు.

రాజుగారికి పట్టుకున్న ఈ దయ్యపు ఆకలి దివాణానికొక పెద్ద సమస్య అయింది. వైద్యులు వచ్చి పరీక్ష చేసి రాజుగారికి ఏ జబ్బూ లేదన్నారు. ఆయన చూడటానికి మామూలుగానే ఉన్నాడు. ఆయనకు కావలిసిన తిండి సేకరించుకు రావటానికి భటులు గ్రామాల మీద పడ్డారు. త్వరలోనే దేశమంతా గుల్ల అయిపోయే ప్రమాదం ఏర్పడింది.

ఈ దయ్యపు ఆకలి రాజుగారికి కూడా సమస్యే అయింది. తనకు కావలిసినంత ఆహారం సేకరించటం తన భటులకుకూడా క్రమంగా సాధ్యం కాకుండా పోతున్నదని గమనించి ఆయన తన సామంతుల మీద బరువు వెయ్య నారంభించాడు. ఆయన

టి. రమణారావు



ఒక్కొక్క సామంతు వద్దకూ వెళ్ళి వారమో, రెండు వారాలో, నెలో అతిథిగా ఉండసాగాడు. రాజుగారికి తిండి సంపాదించే భారం వారిపైన పడింది. రాజుగారు వస్తున్నారంటేనే వాళ్ళకు గుండెల్లో రాయి పడేది. ఈ రోజుల్లోనే సభాపతి అనే ఒక బ్రహ్మచారి యువకుడు కాశీలో సకల విద్యలూ అభ్యసించి, అనేక మంది పండితుల మెప్పు పొంది స్వదేశానికి తిరిగి వస్తూ చిత్రపుర రాజ్యంలోని ఒక సామంతుడి ఇంటికి అతిథిగా వచ్చాడు.

ఆ చుట్టు పక్కల ఉండే విద్వాంసులందరూ సభాపతి రాక విని చూడవచ్చారు. విద్వద్గోష్టి జరిగింది. సభాపతి అనేక వింత విషయాలూ, హాస్య విషయాలూ చెప్పి అందరినీ నవ్వించాడు. అందరూ నవ్వినా సామంతుడి ముఖాన హాస్యరేఖ కనిపించ లేదు. ఇది గమనించి సభాపతి, "ఏం బాబూ? మీ మనస్సు అన్యాయుత్తంగా ఉన్నట్టున్నది. విచార కారణమేమీ లేదుగదా?" అని అడిగాడు. దానికి సామంతుడు, "విచార కారణం లేకేం? ఈ సాయంకాలమే మా రాజుగారు అతిథిగా వస్తున్నట్టు వార్త వచ్చింది," అని రాజుగారికి తాను అందించవలిసిన దయ్యపు తిండి గురించి సవిస్తరంగా చెప్పాడు.

అంతా విని సభాపతి కొంచెం సేపు ఆలోచించి, "మీ రాజుగారి సమస్య మీ కేమీ లేకుండా నేను చేస్తాను. మీరు మాత్రం ఒక రోజల్లా నేను చెయ్యమన్నట్టు చెయ్యాలి," అన్నాడు. సామంతుడు సరే నన్నాడు. సూర్యాస్తమయ మయ్యే వేళ రాజు వస్తూనే, "ఫలహారం! ఫలహారం!" అని కేక పెట్టాడు.

రాజుగారికి ఒక్కడికీ పీట వేసి ఆయన ముందు పిండి వంటలూ, పళ్ళూ పళ్ళాలతో తెచ్చి ఉంచారు. ఆయన వాటన్నిటినీ ఆరగించసాగాడు. సభాపతి కొంత దూరంలో కూచుని ఒక ఎండు గడ్డి పోచ నోట పెట్టుకుని నమల నారంభించాడు.

రాజుగారు ఇది చూసి, "నీ కేమైనా పిచ్చా ఏమిటి? పశువులాగా ఎండు గడ్డి తింటున్నావు!" అని అడిగాడు.

"పిచ్చి కాదు, మహారాజా. తమ పంక్తిని మరెవరూ లేకపోవటం భావ్యంగా ఉండదని ఇలా చేస్తున్నాను," అన్నాడు సభాపతి.

రాజుకు ఈ మాట చురుక్కున తగిలింది. ఆయన తన ముందున్న పళ్ళలో ఒకటి తీసి సభాపతి కిచ్చాడు. సభాపతి ఆ పండు ఒలుస్తూ, "నాది ఒక్క మనవి. తమరు అంగీకరిస్తే మనవి చేస్తాను," అన్నాడు.

"ఏమిటది?" అని రాజు అడిగాడు.

"రాత్రి భోజనం చేసేలోపల తమరు కాస్సేపు నిద్రపోవాలి," అన్నాడు సభాపతి.

"నే నెలాగూ చిన్న కునుకు తీద్దామనే అనుకుంటున్నాను. అందుచేత నీ కోరిక తీర్చటం ఏమంత కష్టం కాదు," అన్నాడు రాజు.

ప్రయాణపు బడలికా, భుక్తాయాసమూ తోడు కావటం చేత రాజుగారు ఒక గదిలో పడుకుని నిద్రపోయాడు. ఆయన నిద్రించే సమయంలో సభాపతి రాజుగారి కాళ్ళూ చేతులూ గట్టిగా బంధించమని సామంతుడి నౌకర్లకు చెప్పాడు. తన నౌకర్లు ఈ పని



చేసేటప్పుడు సామంతుడు అక్కడ లేకుండా వెళ్ళిపోయాడు.

కాస్సేపటికి రాజుగారు నిద్రలేచి తాను బంధితుడై ఉన్నట్టు గ్రహించాడు. ఆయనకు ఆకలి కూడా దహించుకు పోతున్నది.

ఆయన నిద్ర లేచినట్టు తెలియగానే సభాపతి వంటవాళ్ళ చేత రకరకాల కూరలూ, పిండి వంటలూ, పాయసాలూ, వెన్నా, నెయ్యీ చిన్న చిన్న మొత్తాలలో తెప్పించి తన ముందు పెట్టుకుని కూచున్నాడు. వాటిని చూస్తుంటేనూ, వాటి వాసన తగులు తూంటేనూ రాజుగారి ఆకలి మరింత అవుతున్నది.

"మహారాజా, తమ కొక వింత విషయం చెప్పాలి. ఈ విషయం ఒక సిద్ధుడి ద్వారా నేను తెలుసుకున్నాను. హిమాలయ పర్వతాల మధ్య ఒక లోయ ఉన్నది. ఆ లోయలో ఒక పెద్ద భవనం ఉన్నది. అది మామూలు భవనం కాదు. దాని గోడలు జున్నుతో కట్టారు. దాని ద్వారాలకు గారెలూ, జిలేబీలతో తోరణాలు కట్టారు. దాని లోపలి అరుగులు హల్వాతో చేసినవి. దాని కప్పు రొట్టెలతో పరిచారు. ప్రతి గది లోనూ చిన్న కొలను ఉంటుంది. ఒక కొలను నిండా వేడి వేడి పాయసం, ఒక కొలను నిండా పాల మీగడ, ఒక కొలను నిండా ద్రాక్షరసం, ఇంకో కొలను నిండా కొబ్బరికాయ పాలు! ఈ కొలనుల చుట్టూ చిత్రాన్నాలు గట్టుగా అమర్చారు..." ఈ విధంగా వర్ణిస్తూ సభాపతి తన ముందున్న భక్ష్యాలను రాజుగారి ముక్కు దగ్గిరికీ, నోటి దగ్గిరికీ తీసుకుపోయి మళ్ళీ వెనక్కు తీస్తూ వచ్చాడు. ఇలా కొంత సేపయాక రాజుగారి నోట్లో ఉన్న పిశాచం ఇక భరించలేక పోయింది. అది సభాపతి చేతిలో ఉన్న భక్ష్యాలను అందుకోవటానికి బయటికి దూకేసింది. వెంటనే సభాపతి దాన్ని ఒడిసి పట్టుకుని, తీసుకుపోయి వంటశాలలోని గాడిపొయ్యిలో వేసేశాడు.

పిశాచి తన నోటి నుంచి బయటికి పోయిన క్షణంలోనే రాజుగారికి స్పృహ తప్పిపోయింది. ఆయన మర్నాడుదయానికల్లా సుఖంగా లేచాడు. కాని ఆయనకు పూర్వం ఉన్న వెర్రి ఆకలి అంతా పోయింది. తోటివాళ్ళందరూ ఫలహారం చేసినట్టుగానే చేశాడు.

తన వ్యాధి నయమైనందుకు ఆయన ఎంతో సంతోషించి సభాపతికి ఎన్నో విలువైన కానుక లిచ్చి సన్మానించాడు. వాటితో సభాపతి తన స్వదేశం చేరుకుని, పెళ్ళాడి సుఖంగా ఉన్నాడు.





# ముసలమ్మ యుక్తి

పూర్వం ఒక గ్రామంలో సీతారామయ్య అనే ఒక పండితుడుండే వాడు. ఆయన ఊరి పిల్లలకు చదువు సంధ్యలు నేర్పి గురు దక్షిణలు పొంది, అయిదు వందల రూపాయలు వెనక వేసుకున్నాడు.

ఇంతలో కాశీలో ఒక విద్వత్సభ జరిగింది. సీతారామయ్యకు కూడా పిలుపు వచ్చింది. తన దగ్గిర నిలవ ఉన్న డబ్బు ఎవరి దగ్గిర దాచి ఉంచాలా అన్న సమస్య సీతారామయ్యకు ఏర్పడింది. ఇంటి దగ్గిరే ఉంచుదామంటే భార్య ససేమిరా వద్దన్నది. "సొమ్ము భయంకరమైనది. దానికి నేను కుక్క కాపలా కాయలేను. ఏ రాత్రివేళో దొంగలు వచ్చి పడి నా ప్రాణాలు తీసేస్తారు," అన్నదావిడ.

ఎక్కడ దాస్తే సొమ్ము భద్రంగా ఉంటుందా అనుకుంటూ సీతారామయ్య కోటయ్య అంగడికి వెళ్ళాడు. తనకు ఏర్పడిన సమస్య గురించి కోటయ్యకు చెప్పి, "నీ సలహా ఏమిటి? ఈ డబ్బు ఎవరి దగ్గిర దాచి పెడితే క్షేమమంటావు?" అని అడిగాడు.

"బాబూ, డబ్బు దగ్గిర ఆ బ్రహ్మదేవుణ్ణయినా నమ్మవద్దు. అది మహా పాపిష్టిది," అన్నాడు కోటయ్య.

వీరిద్దరూ మాట్లాడుతూండే సమయంలో అంగడి గుమాస్తా ఒక స్త్రీకి నెయ్యి తూచి ఇచ్చి డబ్బు తీసుకుని పంపేశాడు.

కోటయ్య ఈ అమ్మకం వివరాలు కనుక్కొని, "ఓరి పాపిష్టివాడా, ఆ మనిషి దగ్గిర నాలుగు దమ్మిడీలు అధికంగా పుచ్చుకున్నావు. మనకు న్యాయంగా రావలిసిన లాభం ఒక్క దమ్మిడీ అయితే అయిదు దమ్మిడీలు లాభం పట్టావు. నీ కెన్నిమార్లు చెప్పినా నీ బుద్ధి మారదు. జ్ఞాపకం ఉంచుకుని ఆ మనిషి ఇంకోసారి బేరానికి వచ్చి

ఎం. రంగారావు



నప్పుడు ఆ నాలుగు దమ్మిడీలూ వాపసు ఇచ్చెయ్యి," అని గుమాస్తాను కసిరాడు.

ఈ సంఘటనతో సీతారామయ్యకు కోటయ్య మీద గురి ఏర్పడింది. ఆయన అంగడిలో తనకు కావలిసిన సరుకులు తీసుకుని, ఇంటికి వెళ్ళి తన అయిదువందల రూపాయలూ మూట గట్టి తెచ్చి, "ఇదుగో, కోటయ్యా! ఇదే నా డబ్బు. నేను కాశీ నుంచి తిరిగి వచ్చేదాకా దీన్ని దాచి ఉంచే భారం నీదే!" అన్నాడు.

"అమ్మయ్యో, నేనా డబ్బును తాకనైనా తాకను. కావలిస్తే మీరే మా ఇంట మీ యిష్టం వచ్చిన చోట గొయ్యి తీసి డబ్బు పాతేసి వెళ్ళండి. తిరిగి వచ్చినాక తవ్వి తీసుకో వచ్చు," అన్నాడు కోటయ్య.

"నిజంగా కోటయ్య ఎంత మంచివాడు!" అనుకుని సీతారామయ్య తన సొమ్ము ఒక చోట గుర్తుగా పాతిపెట్టి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

ఆయన కాశీకి వెళ్ళి, విద్వత్సభలో పాల్గొని, స్వగ్రామానికి తిరిగి వస్తూనే కోటయ్య ఇంటికి వెళ్ళి, "నా సొమ్ము నేను తీసుకుపోతాను," అన్నాడు.

"మహరాజుగా తీసుకు వెళ్ళండి. ఎక్కడ పాతిపెట్టారో గుర్తుందిగదా?" అన్నాడు కోటయ్య.

కాని సీతారామయ్య తవ్వి చూస్తే ఉండ వలిసిన చోట డబ్బు లేదు. సొమ్ము కని పించలేదని అంటే కోటయ్య, "దాని సంగతి మీకు తెలియాలి గాని నా కేం తెలుస్తుంది, బాబూ ?" అనేశాడు.

మోసం జరిగిపోయిందని గ్రహించి సీతా రామయ్య కుంగిపోయిన మనస్సుతో ఇంటి దారి పట్టాడు.

దారిలో సీతారామయ్యకు శేషమ్మ అనే ముసలావిడ ఎదురుపడి, "ఎప్పుడు వచ్చావు, నాయనా? అలా విచారంగా ఉన్నావేం?" అన్నది.

సీతారామయ్య ముసలమ్మకు జరిగిన దంతా చెప్పాడు. శేషమ్మ కొంచెంసేపు ఆలోచించి, "నాయనా, నీ సొమ్ము యావత్తూ కోటయ్య చేత కక్కిస్తాను. నేను చెప్పినట్టు చెయ్యి," అంటూ ఒక ఉపాయం చెప్పింది. సీతారామయ్య ఆమె చెప్పినట్టు చెయ్యటానికి సిద్ధపడ్డాడు.

ఇది జరిగిన కొద్దిసేపటికే ముసలమ్మ రెండువేల రూపాయలు ఖరీదు చేసే నగలు పట్టుకుని కోటయ్య వద్దకు వెళ్ళింది. ఆమె కోటయ్యతో, "చూడు, నాయనా! నా కొడుకు పదేళ్ళక్రితం చదువు కోసం కాశికి వెళ్ళాడు. ఇంతవరకు వాడి జాడ లేదు. నేనా పెద్దదాన్నయిపోయాను. ఎప్పుడు చస్తానో తెలీదు. అందుచేత కాశికి వెళ్ళి నా కొడుకు జాడ తెలుసుకుందామని తీర్మానించుకున్నాను. నేను ఒంటరిదాన్ని. నా దగ్గిర రెండు వేలు చేసే ఈ నగలున్నాయి. వీటిని వెంట తీసుకుపోతే దొంగలు దోచేస్తారు. నువు ధర్మాత్ముడవనీ, మన ఊరి సీతారామయ్య కూడా కాశీ వెళ్ళేటప్పుడు తన సొత్తు నీ దగ్గిరే దాచబెట్టాడనీ, ఇతరుల సొమ్మును నీవు మట్టితో సమంగా చూస్తావనీ అన్నారు. అందుచేత ఈ సొమ్ములు నేను తిరిగి వచ్చేదాకా నీ దగ్గిర దాచి ఉంచు, బాబూ!" అన్నది.



కోటయ్య తన పంట పండిందను కున్నాడు. సీతారామయ్య తిరిగి వచ్చిన సంగతి కూడా ముసలమ్మ కింకా తెలియ లేదనుకున్నాడు. ఆయన ఆవిడతో, "అమ్మా, మీ నగలు మీ చేత్తోనే మీ యిష్టం వచ్చిన చోట పాతి పెట్టుకోండి," అన్నాడు.

ఇంతలోనే సీతారామయ్య అక్కడికి వచ్చి, "చూడు, కోటయ్యా, నేను సొమ్ము పాతిపెట్టిన చోటు గురించి పొరబడ్డాను. అసలు చోటు జ్ఞాపకం వచ్చింది. అక్కడ తవ్వుకుంటాను," అన్నాడు.

కోటయ్య గుండె గుబుక్కుమన్నది. సీతారామయ్య పాతిపెట్టిన అయిదు వందలూ తాను స్వాహా చేసినట్టు తెలిస్తే ముసలమ్మ తన రెండు వేల రూపాయల నగలూ తన ఇంట దాచిపెట్టదు. అందుచేత కోటయ్య, "మీకు కలిగిన సందేహమే నాకూ కలిగి మరో చోట తవ్వి చూశాను. మీ మూట చెక్కు చెదరకుండా దొరికి పోయింది," అంటూ లోపలికి వెళ్ళి సీతారామయ్య మూట తెచ్చి సీతారామయ్య చేతి కిచ్చేశాడు.

ఇది జరగగానే ముసలమ్మ సీతారామయ్య కేసి పరకాయించి చూసి, "ఎవరూ? సీతారామయ్యేనా? కాశీ నుంచి ఎప్పుడొచ్చావు, నాయనా? చూడూ, అక్కడ మా అబ్బాయిగాని కనిపించాడా?" అని అడిగింది.

సీతారామయ్య ఆమెతో, "ఇంతకుముందే చేరుకున్నాను. కాశీలో మీ వాడు కనిపించాడు. నాకు రెండు రోజులు వెనకగా బయలుదేరుతున్నాననీ, మిమ్మల్ని బెంగ పడవద్దనీ చెప్పాడు!" అన్నాడు.

"అమ్మయ్య, బతికించావు! అయితే మరి నేను కాశీ వెళ్ళవలిసిన అవసరం లేదన్నమాటే!" అంటూ ముసలమ్మ సీతారామయ్యతో సహా బయలుదేరింది. జరిగినది చూసి కోటయ్య నిర్ఘాంతపోయాడు.





# అరణ్యకాండ

ఖర దూషణులూ, త్రిశిరుడూ మొదలైన రాక్షసవీరులు తమ పధ్నాలుగువేల రాక్షస బలగంతో రాముడి ప్రతాపాగ్నిలో మాడి మసి అయిపోగా అకంపనుడనే రావణుడి చారుడు ప్రాణాలతో తప్పించుకుపోయి రావణుడి దర్శనం చేసుకున్నాడు.

"రావణరాజేశ్వరా, జనస్థానంలో ఉండే మన రాక్షసు లందరూ యుద్ధంలో వధ అయారు. నేను మాత్రం ఎలాగో ప్రాణాలతో బయటపడి ఈ వార్త చెప్పటానికి వచ్చాను," అని అకంపనుడు అంటూండగానే రావణుడు కళ్ళెర్రజేసి అగ్నిహోత్రుడులా అయిపోయి, "ఎవడికి కాలం మూడింది? నేను అగ్నినే దగ్ధం చేస్తాను, మృత్యువునే చంపగలను. సూర్య చంద్రులు కూడా నేను ఆగ్రహిస్తే భస్మమై పోతారు," అని రంకెలు పెట్టాడు.

ఈ అట్టహాసం గమనించి అకంపనుడు ముందుగా రావణుడి వద్ద అభయం పొంది, రాముడు జనస్థానంలోని రాక్షసులందరినీ ఎలా చంపిందీ వివరించి చెప్పాడు.

రావణు డంతా విని బుసకొడుతూ, "ఆ రాముడికి దేవతలందరూ సహాయం వచ్చారు కాబోలు?" అన్నాడు.

"లేదు, లేదు. రాముడు పరాక్రమంలో దేవేంద్రుడికి తీసిపోడు. అగ్నికి వాయువు తోడైనట్టు రాముడికి తోడుగా అతని తమ్ముడు లక్ష్మణు డొకడున్నాడు. జనస్థానంలో ఉండే రాక్షసులను చంపినవాడు రాముడొక్కడే!" అన్నాడు అకంపనుడు.



"అలా అయితే నేను జనస్థానానికి వెళ్ళి ఆ రాముణ్ణీ లక్ష్మణుణ్ణీ చంపేస్తాను," అన్నాడు రావణుడు.

అకంపనుడు లబలబలాడుతూ, "ఆ రాముడి బలపరాక్రమాలు నేను సరిగా చెప్పలేకపోయాను. అతడికి చెలియలి కట్టను భేదించి ప్రపంచమంతా సముద్రంలో ముంచే శక్తి ఉన్నది. ఆకాశాన్ని నక్షత్రాలతో సహా నాశనం చెయ్యగలడు. మూడు లోకాలూ నిర్మూలించి, కొత్తసృష్టి ప్రారంభించగలడు? రాముడు నీ చేతిలో ఎన్నటికీ చావడు. అతడు చావటానికి ఒక్కటే ఉపాయం: అతడి భార్య సీత అప్సరసలను మించిన సౌందర్యవతి; సర్వాంగ సుందరి. ఆమె అంటే ఆ రాముడికి ప్రాణంతో సమానం. ఆమెను ఎత్తుకువస్తే ఆ రాముడు కుమిలి కుమిలి చస్తాడు!" అని సలహా ఇచ్చాడు.

రావణుడు కొంచెం ఆలోచించి, తల పంకించి, "మంచిది, రేపు ఉదయమే బయలుదేరి వెళ్ళి ఆ సీతను తీసుకువచ్చేస్తాను," అన్నాడు.

మర్నాడు ఉదయానే అతను ప్రకాశవంతమైన రథానికి గాడిదలను పూన్చి దానిలో ఎక్కి మారీచుడి ఆశ్రమానికి వెళ్ళాడు. తాటక కొడుకైన మారీచుడు రాక్షసరాజుకు చక్కగా భోజనం పెట్టి, "ఇలా తలవని తలంపుగా వచ్చారు, రాక్షసులందరూ క్షేమమే గదా?" అని అడిగాడు.

ఆ మాటకు రావణుడు, "మారీచా, జనస్థానంలో ఉన్న నా బంధువు లందరినీ రాముడు వధించాడు. అతడి భార్యను ఎత్తుకుపోదామని వచ్చాను. నీ సహాయం కావాలి," అన్నాడు.

"అయ్యో, హితం కోరినవాడిలాగా వచ్చి నీకు సీత మాట చెప్పిన దుర్మార్గు డెవరు? నిశ్చయంగా నీ నాశనం కోరే, వాడు నిన్ను

సీతాపహరణానికి ప్రేరేపించి ఉంటాడు. ఈ పిచ్చి ఆలోచన కట్టిపెట్టి, లంకకు వెళ్ళి నీ భార్యలతో సుఖంగా ఉండు; ఈ దండ కారణ్యంలో ఆ రాముణ్ణి తన భార్యతో సుఖంగా ఉండనీ. ఆ రాముడి జోలికి పోవటం నిద్రించే సింహాన్ని లేపగొట్టటమే!" అన్నాడు మారీచుడు.

మారీచు డింతగా చెప్పినాక రావణుడు తన యత్నం మానుకుని లంకకు వెళ్ళి పోయాడు. ఇంతలో శూర్పణఖ కూడా లంకకు వెళ్ళింది. నిండు కొలువులో ఉన్న రావణుడి వద్దకు వెళ్ళి, పరుషంగా మాట్లాడుతూ, "భోగలాలసుడవై మదించి నీకు వచ్చిపడే ఘోరాన్ని కూడా తెలుసుకోకుండా ఉన్నావు! నీ కన్న పసిపిల్లలు నయం! జనస్థానంలో రాముడు ఋషుల కోరికపై నీ వాళ్ళనందరినీ చంపి, దండ కారణ్యంలో రాక్షసపురుగు లేకుండా చేస్తే నీకా సంగతి చెప్పటానికి చారులు కూడా లేరు; నీ వింకేం రాజ్యం చేస్తావు? ఈ రాజ్యం ఉండదు; నీవు త్వరలోనే నశిస్తావు!" అన్నది.

రావణుడీ మాటలు సహించలేక రోషంతో, "ఎవడీ రాముడు? ఎక్కడి నుంచి వచ్చాడు? ఎలా ఉంటాడు? ఏపాటి



పరాక్రమం గలవాడు?" అని శూర్పణఖను అడిగాడు.

"రాముడు దశరథుడి కొడుకు. అజాను బాహువు. నవమన్మథుడు. అతడు యుద్ధం చెయ్యటం నేను కళ్ళారా చూశాను. వర్షం లాగా బాణాలు వచ్చిపడటం నాకు కనిపించిందేగాని, అతను బాణాలు తీయటమూ, ఎక్కుపెట్టటమూ, విడవటమూ నాకు కనిపించలేదు. ఒక్కడే క్షణంలో పధ్నాలుగు వేలమంది రాక్షసులను చంపేశాడు. ఆడదాన్ని గదా అని నన్ను చంపక అవమానించి పంపాడు. రాముడి తమ్ముడు లక్ష్మణుడు ముక్కోపి. మహాబలశాలి. అన్నకు



కుడిభుజం. ఇక రాముడి భార్య సీత! ఇంతంత కళ్ళు! నిండు చంద్రుడులాటి ముఖం! బంగారువంటి శరీరచ్ఛాయ! సన్నటినడుము! చక్కని పిరుదులు! అటువంటి భార్య ఉంటే వేరే స్వర్గం దేనికి? ఆ సీతను ఎలాగైనా ఇక్కడికి తీసుకువచ్చి నీకు భార్యను చేతామని ప్రయత్నించేసరికి లక్ష్మణుడు నన్నిలా ముక్కు చెవులు కోశాడు. సీతను ఒక్కసారి చూస్తే నీవు మరవలేవు. ఆ రాముణ్ణి చంపేసి నీవాళ్ళ కోసం పగతీర్చుకో, సీతను తెచ్చుకుని భార్యగా ఏలుకో. వెంటనే బయలుదేరు!" అని శూర్పణఖ రావణుణ్ణి రెచ్చగొట్టింది.



రావణుడు సభ చాలించి ఒంటరిగా కూచుని సీతాపహరణం గురించి వివరంగా ఆలోచించాడు. సీతను పరాక్రమంతో తీసుకురావటం కన్న దొంగతనంగా తీసుకురావటమే మేలని అతనికి అనిపించింది. ఎందుకంటే అంతమంది రాక్షసులనూ, రాక్షసవీరులనూ చంపినవాణ్ణి ఓడించి సీతను ఎత్తుకురావటం మాటలు కాదు. అయితే రావణుడు తన ఆలోచనను మండోదరికి గాని మంత్రులకు గాని చెప్పలేదు; వారు నివారిస్తారని భయపడ్డాడు.

రథం సిద్ధం చెయ్యమని రావణుడు తన సారథితో చెప్పి, అందులో ఎక్కి, కామగమనం చేత సముద్రాన్నిదాటి మారీచుడి ఆశ్రమానికి వచ్చిచేరాడు. మారీచుడు అతనికి అతిథి సత్కారాలుచేసి, "ఇంతలోనే మళ్ళీ రావటాని కేమి కారణం? లంకలో అందరూ క్షేమమా?" అని అడిగాడు.

"రాముణ్ణి క్షమించటానికి వీల్లేదు. వాడు దుష్టుడు, క్రూరుడు, మూర్ఖుడు, లుబ్ధుడు. మన రాక్షసుల నందరినీ నాశనం చెయ్యటమేగాక నా చెల్లెలు శూర్పణఖ ముక్కు చెవులు కోయించాడు. సీతను అపహరించ దలిచాను. నాకు నీ సహాయం



కావాలి. నీవు పరాక్రమం గలవాడవు, యుక్తిపరుడవు. నీకు మాయలు తెలుసు. నీ వల్ల కావలిసిన సహాయం చెబుతాను విను. నీవు వెండిచుక్కలు గల బంగారు లేడి రూపం ధరించి రామాశ్రమంలో సీతకు కనపడేలాగా తిరుగు. నిన్ను పట్టితెమ్మని సీత రామలక్ష్మణులను తప్పక పంపుతుంది. ఆ సమయంలో నేను సీతను ఎత్తుకుపోతాను. సీత పోయినాక రాముడు విచారంతో కృశించిపోతాడు. ఆ స్థితిలో అతను యుద్ధానికి వచ్చినా సునాయాసంగా ఓడించేస్తాను," అని రావణుడు చెప్పాడు.



ఈ మాటలు విని మారీచుడికి భయంతో నోరెండిపోయింది. అతను చేతులు జోడించి, "రాక్షసరాజా, ఈ లోకంలో ఇష్టమైన మాటలు చెప్పేవారు కొల్లలు. నచ్చకపోయినా హితమైన మాట చెప్పేవారుండరు, ఒకవేళ చెప్పేవారున్నా వినేవారుండరు. రాముణ్ణి గురించి నీ వసుకునేదంతా అబద్ధం. అతను దుష్టుడూ, మూర్ఖుడూ, లుబ్ధుడూ, క్రూరుడూ ఎంత మాత్రమూ కాడు. అతను ఎవరి జోలికీ వెళ్ళలేదు. శూర్పణఖ సీతను తరిమితే పరాభవించి పంపాడు. ఖరదూషణులు తన పైకి వచ్చిపడితే వారిని చంపాడు; తప్పా? ఈ రాముడు మీసకట్టు కూడా రాని వయసులో, వెయ్యి ఏనుగుల బలంగల నన్ను వెయ్యి యోజనాలు వెళ్ళి సముద్రంలో పడేలా కొట్టాడు. అంతటితో బుద్ధిరాక నేను మరి ఇద్దరు రాక్షసులతోబాటు జింకరూపు దాల్చి, మునిలాగా ఉన్నాడు కదా, ఏం చెయ్యగలడు లెమ్మని అతని ఆశ్రమం మీద పడి అతన్ని చంపబోయాను. రాముడు మూడు బాణాలు ఎక్కుపెట్టాడు. వాటిని చూడగానే నేను తప్పుకుని పారిపోయాను; కాని నా వెంట జింకల రూపంలో ఉన్న రాక్షసు లిద్దరూ చచ్చారు. నాకు బుద్ధి వచ్చింది. నా కిప్పుడు రాముడంటే సింహ

స్వప్నం. ఎక్కడ చూసినా నాకు రాముడే కనిపిస్తాడు. రకారంతో ప్రారంభమయే మాటలు వింటేనే గుండె అవిసిపోతాయి. నామానాన నేను తపస్సు చేసుకుంటున్నాను. నీకు కాలంమూడి రాముడితో తల పడాలని ఉంటే తలపడు. నన్ను మాత్రం ఇందులోకి ఈడవకు. నీ మేలు కోరి నేను చెప్పేది వినకపోతివో నీకు సర్వ నాశనం తప్పదు," అన్నాడు.

రావణుడి కీ మాటలు తల కెక్కలేదు. అతను మారీచుడితో, "దేవతలంతా వచ్చి చెప్పినా నా నిశ్చయం మారదు. నా నిర్ణయం మంచిదా, చెడ్డదా అని నేను నిన్నడిగానా? అడగని మాట లెందుకు చెబుతావు? నేను నిన్నొకటి చెయ్యమని అడిగినప్పుడు నీవు చెయ్యవలిసిందే గాని బదులాడరాదు. నేను చెప్పినట్టు బంగారు లేడి రూపం ధరించి సీతను ఆకర్షించి, ఆ తరవాత నీదారిన నీవు వెళ్ళి పో. నిన్ను పట్టటానికి రాముడు ఒక్కడే వస్తే అతని కంఠధ్వనితో, 'అయ్యో! సీతా! లక్ష్మణా!' అని అరు. అప్పుడు లక్ష్మణుడు కూడా కదులుతాడు. సీత నాకు దక్కుతుంది. ఈ ఉపకారం చేస్తివా నీకు నా అర్ధరాజ్య మిస్తాను. నిరాకరించావో, ఇప్పుడే నీ ప్రాణాలు తీస్తాను.



రాముడు నిన్ను చంపటం అబద్ధమూ, నేను చంపటం నిజమూ అవుతుంది," అన్నాడు.

మారీచుడికి మండిపోయింది. "నన్ను చంపుతానంటున్నావు గాని నీ కీ ఆలోచన చెప్పిన దుర్మార్గుల నెందుకు చంపవు? ఇటువంటి మతిలేని ఆలోచన చేస్తూంటే నీ మంత్రులు నిన్నెందుకు నివారించలేదు? దైవికంగా ఇది వచ్చిపడటంచేత నేను చస్తే అంత ప్రమాదంలేదు. కాని నా తరవాత నీవూ, రాక్షసవంశమూ, లంకానగరమూ కూడా నాశనంకాక తప్పదే, అది ఎంత ఘోరం!" అని మారీచుడు రావణుడితో అని, పోదాం పద మన్నాడు.

అనరాని మాటలన్నీ అన్నప్పటికీ చివరకు తన మాట పాటించాడన్న ఆనందంతో రావణుడు మారీచుణ్ణి ఆలింగనం చేసుకుని, విమానంలాటి తన రథంలో అతన్ని ఎక్కించుకుని, అరటిచెట్ల మధ్యనున్న రామాశ్రమం దగ్గిర అతన్ని దించాడు.

వెంటనే మారీచుడు ఒక ఆకర్షవంతమైన, అపూర్వమైన లేడిరూపం ధరించి, గరికమేస్తూ మెల్లిగా రామాశ్రమం ప్రవేశించి అక్కడే తారట్లాడాడు. ఈ మాయా లేడి శరీరం బంగారు రంగులోనూ, దాని మీది చుక్కలు వెండిరంగులోనూ, పొట్ట తెల్లగానూ, గిట్టలు నిగనిగలాడే నలుపు రంగులోనూ, తోక పంచవర్ణాలలోనూ, కొమ్ముల చివరలు నీలం రంగుగానూ, నోరు కెంపు రంగుగానూ ఎంతో అందంగా ఉన్నాయి. అది కాస్సేపు మేస్తూ, మధ్య మధ్య పచ్చికపై పడుకుంటూ, ఆ ప్రాంతంలోనే చాలాసేపు తిరిగింది.

చివరకు సీత పూలు కోయటానికి చెట్ల మధ్యకు వచ్చి ఆ లేడిని చూడనే చూసింది. చూసి పరమాశ్చర్యం చెంది ఆమె రామలక్ష్మణులను కేకపెట్టింది. ఆమెను సమీపిస్తూ వారుకూడా మాయలేడిని చూశారు. చూస్తూనే లక్ష్మణుడు రాముడితో, "ఈ లేడి చూస్తే మారీచుడి లాగుంది. వాడు మాయా రూపంలో వేటకువచ్చిన రాజులను తిన్నాడు. ఎందరో మునులను తిన్నాడు. ఇలాటి లేడి ఎక్కడా ఉండదు," అన్నాడు.

సీత లక్ష్మణుణ్ణి ఊరుకోమని, రాముడితో, "ఆ లేడి నాకు కావాలి. తీసుకు రా. చక్కగా ఆడుకుందాం. దాని అందం ఏమందం! దీన్ని ప్రాణాలతో తెస్తే, మనతో బాటు అయోధ్యకు తీసుకుపోదాం; భరతుడూ, అత్తలూ చూసి ఎంతో మురిసిపోతారు. ఒకవేళ ఇది ప్రాణంతో చిక్కకపోతే చంపి అయినా తీసుకు రావాలి. దీని చర్మాన్ని నేను ఉంచుకుంటాను," అన్నది.






హాయి గొలిపే పరిశుభ్రంగా వుండండి! లైఫ్‌బాయ్‌తో
స్నానంవల్ల ఉత్సాహంతో ఉప్పొంగి పొండి! జ్ఞాపక
ముంచుకోండి, స్నానం చేయునప్పుడు లైఫ్‌బాయ్ మురికిలో
గల క్రిములను కడిగివేయును — ఎంతో ఆరోగ్యవంత
మైన హాయి గొలుపును! ఔను, లైఫ్ బాయ్‌తో
కుటుంబంలో అందరి జీవితం ఆరోగ్యవంతం.

**ఎక్కడ లైఫ్‌బాయ్ వున్నదో అక్కడ ఆరోగ్యము వున్నది!**

L.33-X29 TL

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

'షూ్యర్-షాట్'




# మీరు ఎదురుచూస్తున్న కెమెరా

"షూ్యర్-షాట్" పటేల్ ఇండియా కానుక. జగద్విఖ్యాతిగాంచే ఆధునాతన కెమెరా. ఫొటోగ్రాఫీలో అత్యుత్తమ ఫలితాలను ఆశించే వారికోసం దీనిని నిర్మించారు. దీనిని ఉపయోగించడం ఎంత సులభమంటే, చిన్న పిల్లలు కూడా దీనితో ఫొటోలు తీయగలరు. మీరు చేయవలసినదల్లా 12 సార్లు మీటనొక్కడమే, దాంతో 12 చక్కని ఫొటోలు సాధ్యపడతాయి.

షూ్యర్-షాట్ ప్రత్యేక అంశాలు గమనించండి :—

అందమైన బేకలైట్ కేసు • 120 ఫిల్మ్ మీద 12 చతురస్రాకారపు చిత్రాలు • డబుల్ ఎక్స్‌పోజరు జరగకుండా ఏర్పాటు • టైమ్ ఎక్స్‌పోజరు • ఫ్లాష్ సింక్రొనైజేషన్.

**రూ. 25**
స్థానిక పన్నులు అదనం

పెద్ద ఫొటో వ్యాపారులవద్ద దొరుకుతాయి, లేక

**పటేల్ ఇండియా ప్రైవేట్ లి.,** బొంబాయి · ఢిల్లీ · కలకత్తా · మద్రాసు.

PSS-G-37EL

ప్రణాళికావారోత్సవాలు

౧౯౬౨

# పంచాయతీరాజ్యం ద్వారా

★ రాజకీయ స్వాతంత్ర్యం, పయోజనులకు వోటు చేసే హక్కు, ప్రజాస్వామిక జీవన విధానం— ఇది ఒక త్రివేణి సంగమం. అదే పంచాయతీ రాజ్యం.

★ సమాజ వికాసోద్యమం ఆర్థిక ప్రగతి సాధనకు వివిధ రంగాలలో కృషి జరుగుతున్నది. ఈ ఉద్యమానికి బలం చేకూర్చేది గ్రామపంచాయతీయే.

★ గ్రామ సీమలలో పరిశుభ్రత, ఆరోగ్యకరమైన జీవితం, అభివృద్ధి మన లక్ష్యాలు. అందుకు మన సాధనాలు పరిశ్రమ, స్వయం సహాయం, పరస్పర సహకారం.

సమాజ వికాసం

---

## సమాచార, పౌరసంబంధశాఖ

ఆంధ్రప్రదేశ్

# వాటర్‌బరీస్ కాంపౌండ్
## ఎర్ర లేబిలు

వీటికి దివ్యముగా పనిచేస్తుంది: దగ్గు మరియు జలుబు ఇన్‌ఫ్లుయంజా, గొంతు అస్వస్థతలు, ఉబ్బసము




ఒక్కయందు మాత్రమే కాదు
ఒక నమ్మకమైన టానిక్ కూడ!

చాలఏళ్లు పరీక్షలు జరిపి కనుగొన్న ఫార్ములానుండి తయారుచేయబడిన వాటర్‌బరీస్ కాంపౌండ్ నమ్మకమైన టానిక్కు మరియు దానిని వాడమని డాక్టర్లు సిఫార్సు చేస్తారు.

**చికిత్సగా ఉపయోగము :** వాటర్‌బరీస్ కాంపౌండ్‌లో కఫహారములగు క్రియొసోట్ మరియు గయాకోల్ కలవు. అవి వాయునిత్తులను శుభ్రపరుస్తాయి, దగ్గు మరియు జలుబును త్వరితముగా మరియు గుణము కలిగించేలా అడ్డుతాయి.

**టానిక్‌గా ఉపయోగము :** రోగములు రాకుండా మరియు తరుచుగా వ్యాపించే అంటు వ్యాధులు సోకకుండా అడ్డుటలో, దేహములో శక్తి నిలవలను హెచ్చుచేయుటలో వాటర్‌బరీస్ కాంపౌండ్ సహకరిస్తుంది, ఆకలిపుట్టిస్తుంది, జీర్ణముగుటలో సహకరిస్తుంది, రక్తమును శుభ్రపరుస్తుంది, మరియు ఖనిజ లవణముల నష్టమును భర్తీ చేస్తుంది

WCRY-I-TEL

వార్నర్-లేంబర్ట్ ఫార్మస్యూటికల్ కంపెనీ ( పరిమితమైన బాధ్యతతో యు. ఎస్. ఎ. లో స్థాపితము )



ధూతపాపేశ్వర్

# బ్రాహ్మీ ఆమలా

## కేశవర్ధక్ తైలం





ధూతపాపేశ్వర్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ పన్వెల్-బొంబాయి

---

పాప్యులర్

# కేమెల్ ఇంక్

ప్రతివారికి ప్రసిద్ధయినది



కెమిలిన్ ప్రైవెట్ లి., బొంబాయి-16







Pratibha-62-1 Tel

"ఏవిటే! ఇంట్లో

# అమృతాంజనం

లేదా?

నా తలనొప్పి ఎలా తగ్గుతుంది?"

ఏమో ఎప్పుడు అవసరమొస్తుందో ఎప్పుడూ అమృతాంజనం దగ్గర వుంచుకోవటం ఉత్తమం. అమృతాంజనం యింట్లో వుందంటే మీరు నిశ్చింతగా వుండవచ్చు.

అమృతాంజన్ లిమిటెడ్

14/15 లజ్ చర్చిరోడ్డు, మద్రాసు-4

బొంబాయి-1, కలకత్తా-1, న్యూఢిల్లీ-1.




JWT AM 1881a

# కప్పు కాఫీ త్రాగుతూ చర్చిద్దాము

ఈసారి విందుకు ధరించవలసిన దుస్తులేవి? క్లబ్ పిక్‌నిక్‌కు చేయవలసిన ఏర్పాట్లేవి? మీ సమస్యలు ఎంత క్లిష్టమైనవి అయినా, వాటిని సత్వరమే పరిష్కరించాలంటే ఉత్సాహం కలిగించి, ఉత్తేజపరిచి, స్నేహాన్ని పెంపొందించగల కాఫీ త్రాగుతూ చర్చించండి.

# కాఫీ ఎల్లవేళల తృప్తినిస్తుంది



మంచి కాఫీ తయారుచేయడం సులభం. ఉచిత కరపత్రం కోసం మాకు వ్రాయండి. ఏ భాషలో కావలసిందీ తెలుపండి.




కాఫీ బోర్డు, బెంగుళూరు



# 13. "క్రేటర్" సరస్సు

ఈనాటి అమెరికాలోని ఓరెగాన్ రాష్ట్రంలో ఒకప్పుడొక 12,000 అడుగుల ఎత్తు గల అగ్నిపర్వతం ఉండేది. దాని శిఖరాన హిమానీ సదా లుండేవి. సుమారు 6,550 సంవత్సరాల క్రితం ఈ అగ్ని పర్వతం మహా ప్రళయంగా పేలి తన ఎత్తులో ఒక మైలు (5 వేల అడుగుల చిల్లర) కోల్పోయింది.

దాని ఫలితంగా పోగా మిగిలిన పర్వతంలో ఒక పెద్ద గొయ్యి ఏర్పడింది. ఈ గొయ్యి లోతు 400 అడుగులు, దాని నిడివి 6 మైళ్ళు. కాలక్రమాన ఈ గోతిలోకి నీరు వచ్చి చేరింది. నీటితో గొయ్యి లోతు సగమే నిండింది. నీటి మట్టం పెరగక తరగక నిలిచిపోయింది. ఏటా ఈ నీరు ఎంత మేరకు ఇగిరి పోతుందో అంతే మళ్ళీ చేరు తూంటుంది.

ఇదే జగద్విఖ్యాతమైన "క్రేటర్" సరస్సు. "క్రేటర్" అంటే అగ్ని ముఖం.

ఈ సరస్సును జాన్ వెజ్లీ హిల్మన్ అనే ఆయన 1853, జూన్ 12న కనుగొన్నాడు. ఇప్పుడు ఈ సరస్సు చుట్టూ 250 చదరపు మైళ్ళ మేర అమెరికా ప్రభుత్వం ఒక నేషనల్ పార్క్ నిర్మించింది. ఇక్కడికి అనేకమంది యాత్రికులు వస్తూంటారు. వీరి సౌకర్యం కోసరం బంగాళాలూ, హోటళ్ళూ మొదలైనవి ఏర్పాటై ఉన్నాయి.





# ప్రశ్నోత్తరాలు

1. *మంచాళ భారతి, హైదరాబాద్*

అన్నయ్యా, దీపావళి సంచికలో "అట్ట చివరి బొమ్మ"కు దానిని గూర్చిన మహాభారత కథకు సంబంధము ఎట్లు కుదిరినదో తెలియ జేస్తారా?

ఎలాగూ కుదరలేదు. మహాభారత కథను "అట్ట చివరి బొమ్మ" అనే శీర్షికతో ప్రచురిస్తూ వస్తున్నాము. దీపావళి సంచిక కోసం ఆ పేరు మార్చలేదు.

2. *వి. ఎస్. ఎస్. ఆచారి, పాత బొబ్బిలి*

మీ రెపుడు రామాయణం, భారతం ప్రచురిస్తున్నారు గాని భాగవతం ప్రచురించినట్లు లేదు?

1940 డిసెంబరు నుంచి 1952 మే సంచిక దాకా భాగవతం ప్రచురించాం.

3. *సంకు సూర్యకుమారి, ఏలూరు*

పూర్వం మహమ్మదీయులు హిందూ దేవాలయములను నాశనము చేసిరి గదా అప్పుడు ఏ దేముడు వారిని అడ్డగించలేదే?

మనిషి నిర్మించిన దాన్ని మనిషే రక్షించుకోవాలి.

4. *యస్. రామమూర్తి, చెన్నూరు*

చంద్రమండలం వరకు పోయిన రాకెట్లు మరల క్రిందికి ఎలా రాగలుగుతున్నాయండీ? అక్కడ భూమ్యాకర్షణ శక్తి లేదుగా.

చంద్రుడి దాకా వెళ్ళి భూమి కేసి తిరిగి వచ్చిన రాకెట్ ఇంతవరకు ఒకటే ఉన్నది. అది చంద్రుడి అదృశ్య భాగాన్ని ఫొటోగ్రాఫ్ చేసింది. చంద్రుణ్ణి చుట్టి భూమికేసి వచ్చింది. సెకండుకు రెండు మైళ్ళ వేగంతో తన సమీపంలోకి వచ్చిన వస్తువులను చంద్రుడు ఆకర్షించలేదు. ఆ వేగంతో భూమికేసి తిరిగి వచ్చే వస్తువు తిరిగి భూమ్యాకర్షణ క్షేత్రంలోకి విధిగా వస్తుంది. చంద్రుడి పైన దిగిన అంతరిక్ష నౌకలు తిరిగి భూమికి రావాలంటే రాకెట్ ఇంజన్ల సహాయంతో మాత్రమే రాగలుగుతాయి.

5. జె. శ్యామసుందర్, గుంటూరు

చైనా మన దేశముపై దురాక్రమణ చేసిన ఈ అత్యవసర సమయములో మన "చందమామ" ఖరీదును 10 న. పై. ఎక్కువ చేసి (మూడు నెలల కాలము) అట్లు వచ్చిన యెక్కువ ధనమును రక్షణ నిధికి "చందమామ" పాఠకుల విరాళముగా యివ్వవలసినదిగా కోరుచున్నాను. "చందమామ" అట్టపై 50+10 న. పై. అని ముద్రించ వలసినదిగా కోరుచున్నాను.

ఈ సూచన అమలు చెయ్యటంలో అనేక రకాల చిక్కులున్నాయి. కాని రక్షణ నిధికి సహాయం చెయ్యవలసినదిగా ఈ సంచిక సంపాదకీయం ద్వారా "చందమామ" పాఠకులకు విజ్ఞప్తి చేసి ఉన్నాము.

6. సి. ఎస్. వి. రెడ్డి, అలువాల

భూమ్యాకర్షణ శక్తి అంతరిక్షంలోకి ఎన్ని మైళ్ళ ఎత్తు వరకు వ్యాప్త మయింది?

ఆకర్షణ శక్తికి అవధుల్లేటూ లేవు. భూమియొక్క ఆకర్షణ నుంచి తప్పించుకుని ఆకాశంలోకి పోయిన వస్తువు చంద్రుడి యొక్క ఆకర్షణకు గురి అవుతుంది. ఇది చంద్రమండలానికి సుమారు 23,000 మైళ్ళ దూరాన జరుగుతుంది.

7. కొండపల్లి రామారావు, అలమంద

ఉల్కలు భూమికి 150-200 మైళ్ళ దూరానే మండి పోతాయన్నారు గదా. కాని 1833లో భస్మమై పోగా మిగిలిన 36 టన్నుల బరువు గల ఉల్కను భూమిని దున్నుతుండగా "పియర్" అనే శాస్త్రవేత్త గ్రీన్‌లాండులో దొరికినట్లు రికార్డు చేశారు. ఉల్కలు అంత పెద్దవిగా ఉంటాయా?

అంతంత పెద్ద ఉల్కలు చాలా అరుదుగా పడతాయి. సాంతం భస్మం కాకుండా నేలపై పడే ఉల్కలే ఏటా అయిదుకు మించకుండా దొరుకుతూంటాయుట. గడచిన మార్చి 19 న సాయంకాలం 4 గంటలవేళ సోవియెట్ రష్యాలో క్లయిపేదా అనే చోట ఒక ఇంజనీరు ఇంట ఒక ఉల్కాశకలం పడింది. దాని పొడవు 10.6 సెంటి మీటర్లు, వెడల్పు 7.9 సెం. మి, మందం 4.5 సెం. మి. అయితే ఉల్కలలో హెచ్చు భాగం సూక్ష్మమైనవే.

Photo by Subhash Varma



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఎక్కబోతే అంబారీ

పంపినవారు:
పి. మహేశ్వరి, హైదరాబాదు

Photo by B. A. Kadne



బహుమతి
పొందిన వ్యాఖ్య

దిగబోతే గోదారీ

పంపినవారు:
పి. మహేశ్వరి, హైదరాబాదు

# ఆత్మ రక్షణా - స్వేచ్ఛా ★

[ రామతీర్థ కథ ]

నాగరికత అనేది లేనప్పుడు మను షులూ జంతువులూ కూడా అరణ్యాల లోనే నివసించేవారు. అరణ్యంలో ఒక సారి ఒక గుర్రానికీ దుప్పికీ పోట్లాట జరిగింది. ఆ పోట్లాటలో గుర్రం దుప్పి కొమ్ములతో బాగా గాయపడి పారిపోయి మానవుడి వద్దకు వెళ్ళి తనను కాపాడ మని వేడుకున్నది.

"నన్ను నీ వీపు మీద ఎక్కించి తీసుకుపో. నా దగ్గిర విల్లూ, బాణాలూ వున్నాయి, వాటితో నీ శత్రువైన దుప్పిని పరిమార్చి నీకు సహాయం చేస్తాను," అన్నాడు మానవుడు.

గుర్రం అలాగే చేసింది. మానవుడు దానిపై ఎక్కి వెళ్ళి తన బాణాలతో దుప్పిని సంహరించాడు.

గుర్రం మానవుడు చేసిన సహా యానికి కృతజ్ఞత తెల్పుకుని, "ఇక నేను వెళ్ళిపస్తాను," అన్నది.

"ఎక్కడికి వెళతావు? నిన్ను ఎక్కి తిరగటం నాకు చాలా సౌకర్యంగా వున్నది. ఇక నుంచీ నీవు నా బానిసవు," అన్నాడు మానవుడు.

ఈ విధంగా గుర్రం తన క్షేమాన్ని సాధించుకుని స్వేచ్ఛను కోల్పోయి, తన రక్షకుడికే బానిస అయింది.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1963 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫొటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ డిశెంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫొటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## డిశెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఎక్కబోతే అంబారీ

రెండవ ఫోటో: దిగబోతే గోదారీ

పంపినవారు: పి. దుర్గా ఉమామహేశ్వరి,
రాజాదర్‌ఖాన్‌పేట, హైదరాబాదు.

బహుమతి మొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# అ ట్ట చి వ రి బొ మ్మ

కృష్ణుడు చెప్పిన పరశురాముడి కథ విని ధర్మరాజు చాలా సంతోషించాడు. ఈ విధంగా మాట్లాడుతూ పాండవులు భీష్ముడు పడి ఉన్న చోటు చేరారు. ఓఘవతి తీరాన భీష్ముడు అంప శయ్యపై వున్నాడు. ఆయన చుట్టూ మునులున్నారు. ధర్మరాజు మొదలైనవారు అంత దూరానే రథాలు దిగి భీష్ముణ్ణి సమీపించారు.

కృష్ణుడు భీష్ముణ్ణి సమీపించి, "మహాత్మా, నీ మనసు నిర్మలంగా ఉన్నదా? శరీర బాధ హెచ్చుగా లేదు గదా! నీ కింకా యాభైఅరు రోజుల ఆయుర్దాయం ఉన్నది. ఆ తరవాత వసువులు విమానం తెచ్చి నిన్ను తీసుకు పోతారు. ఈలోగా ధర్మరాజుకు నీ జ్ఞాన మంతా బోధించి, ఆ జ్ఞానమంతా నీతోనే అంతరించకుండా చూడు," అన్నాడు.

ఆ మాట విని భీష్ముడు, "నాయనా, ఈ బాణాలతో నా శరీరం చాలా బాధపడి పోయింది. మనసు కూడా కలతగా ఉన్నది. అందుచేత ధర్మరాజు తెలుసుకో దగినదంతా నీవే చెప్పు. నాకు ఆకాశమూ, భూమి కూడా సరిగా కనపడటం లేదు," అన్నాడు.

అప్పుడు కృష్ణుడు భీష్ముడి మన శ్శరీరాలకు కొత్త శక్తి నిచ్చాడు. వెంటనే భీష్ముడిలో కలిగిన మార్పుకు అక్కడి మునులందరూ ఆశ్చర్య పోయారు.

తరవాత కృష్ణుడు భీష్ముడితో, "పాండవులు నీ సంతతివారు. వారికి నీవే ధర్మబోధ చెయ్యటం ఉచితం. జ్ఞాతులనూ, బంధువులనూ, గురువులనూ చంపిన కారణంచేత ధర్మ రాజు నీ ఎదట పడటానికి సిగ్గు పడుతున్నాడు," అన్నాడు.

"సిగ్గెందుకు, నాయనా? ధర్మరాజు అనుసరించినది క్షత్రియ ధర్మమే. అధర్మ పరులైన జ్ఞాతులను చంపటం ధర్మమే. ఆచార వ్యతిరేకులూ, లోభులూ అయితే గురువులను కూడా సుక్షత్రియుడు చంపవచ్చు. ధర్మహాని కలిగినప్పుడు ఉపేక్షించటమే అధర్మం. యుద్ధం వచ్చి పడినప్పుడు వెనకాడేవాడు రాజు అనిపించుకోడు," అన్నాడు భీష్ముడు.

ఆ మాటలతో ధర్మరాజుకు ధైర్యం వచ్చింది. అతను భీష్ముడి ఎదటికి వచ్చి నమస్కరించి ఆయన ద్వారా అనేక ధర్మాలు తెలుసుకున్నాడు. ధర్మరాజు సపరివారంగా రోజూ భీష్ముణ్ణి చూడ రావటమూ, తన సంశయాలను అడగటమూ, భీష్ముడు అతని ధర్మ సందేహాలు తీర్చటమూ పరిపాటి అయింది. రాజధర్మం గురించి ధర్మరాజుకు గల అపో హలను భీష్ముడు పోగొట్టాడు. ధర్మరాజుకు ధర్మోపదేశాల సందర్భంలో అనేక ఉపాఖ్యా నాలు చెప్పాడు.

కృష్ణుడు చెప్పిన గడువు పూర్తి కాగానే భీష్ముడు దేహం చాలించ నిశ్చయించాడు. ఆయన ప్రాణాలు ఒక్కొక్క అవయవంలో నుంచీ వెళ్ళిపోతుంటే ఆ అవయవంలో గల బాణాలు రాలిపోయాయి. చివరకు ఆయన ప్రాణం తలలో నుంచి పోయేసరికి ఆయన శరీరంలో ఒక్క బాణం కూడా మిగలలేదు. ఇది చూసి అందరూ ఆశ్చర్యపడ్డారు

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'






# తెల్లగా చేసుకోండి!

**టినోపాల్ యిచ్చే మెరుగు**

మీ దుస్తులకు టినోపాల్ యిచ్చే మెరుగును పెట్టండి— కళ్లు మిరుమిట్లు కొలిపే అదనపు తెల్లదనం ఒక్క టినోపాల్ మాత్రమే మీ తెల్లని దుస్తులను నిజంగా తళతళలాడేలా చేస్తుంది।

**ఇంకా, టినోపాల్ ఎంతో పొదుపు కూడ।**

టినోపాల్ యిచ్చే మెరుగును పెట్టుకొనుటకు మీకు కాలము లేక డబ్బు ఏమీ ఎక్కువ ఖర్చు కాదు. టీ చెంచాలో నాలుగోవంతు టినోపాల్ ఒక బాల్చీడు దుస్తులను తెల్లగా చేస్తుంది।

జ్ఞాపకముంచుకోండి -




టినోపాల్ జె. ఆర్. గెయిగీ, ఎస్. ఎ. బాల్, స్విట్జర్లెండ్ వారి రిజిష్టరు చేయబడిన ట్రేడు మార్కు.

తయారీదారులు:
సుహృద్ గైగీ లిమిటెడ్ వడి వాడి, బరోడా

సోల్ డిస్ట్రిబ్యూటర్లు:
సుహృద్ గైగీ ట్రేడింగ్ లిమిటెడ్ పోస్టు బాక్సు 965, బొంబాయి-1 బి.ఆర్.

TEL.

# నేడే చూచి ఆనందించండి



నవంబరు 29 మొదలు



మురుగన్ బ్రదర్సు వారి

MB MURUGAN BROS

# ప్రజాశక్తి

మాటలు · పాటలు · అనిసెట్టి

కథ · డైరక్షన్ A.C. త్రిలోకచందర్ M.A.

సంగీతం విశ్వనాథన్ · రామమూర్తి

VANAJA

విజయ రిలీజ్



# *Publisher's Appeal*

Dear Reader,

I am writing this letter in our national emergency created by the Chinese aggression on the frontiers of our Sacred Motherland. I am confident you are all aware of the events. At this juncture I remind you of the age old maxim 'UNITED WE STAND.'

Now is the time for us to unite and give our full support to our Government.

I APPEAL to you to contribute your mite in cash and gold to the NATIONAL DEFENCE FUND and strengthen the hands of our beloved Prime Minister, Chacha NEHRU in the noble cause of driving off the aggressor.

*JAI HIND*

*Yours Sincerely*

B. V. REDDI

*5-11-1962*

